





# అమృతాంజన్

## తలనొప్పిలకు, జలుబులకు, ఒళ్లునొప్పిలకు ఇంటింటా ఉండవలసిన దివ్య ఔషధము

తలనొప్పులకు, జలుబులకు, ఒళ్ళు నొప్పులకు ఉపశమనం కలిగించే అమృతాంజన్‌ను భాధగా ఉన్న చోట కొద్దిగా రాసి రుద్దండి. దానిలో చేరి ఉన్న పది శ్రేష్ఠమైన ఔషధాలు నిమిషాల మీద గుణం కలిగిస్తాయని మీరు తెలుసుకొంటారు.

ఆదాచేసే పెద్ద సీసాలలోను, చిన్న సీసాలలోను తక్కువ వెలకు ఇమిడికగా చిన్న డబ్బాలలోను లభిస్తుంది.




అమృతాంజన్
**80** సంవత్సరాలకు
పైబడిన నమ్మకమైన
దివ్య ఔషధము.

అమృతాంజన్ లిమిటెడ్

AM - 1912

మనసులో మధురావకాశాల సొగసు
ఎప్పుడూ డ్రీమ్‌ఫ్లవర్ తాజాతనపు సొగసు




పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్
టాల్క్

మీరు ఎప్పుడూ వలచే పరిమళము

**Pond's**

CP-1829

**Statement about ownership of CHANDAMAMA ( Telugu )**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. | *Periodicity of Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | ... | B. V. REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Prasad Process Pvt Limited<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. | *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Chandamama Publications<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. | *Editor's Name* | ... | NAGI REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | 'Chandamama Buildings'<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. | *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries:<br>1. B. V. HARISH<br>2. B. V. NARESH<br>3. B. V. L. ARATI<br>4. B. L. NIRUPAMA<br>5. B. V. SANJAY<br>6. B. V. SHARATH<br>7. B. L. SUNANDA<br>8. B. N. RAJESH<br>9. B. ARCHANA<br>10. B. N. V..VISHNU PRASAD<br>11. B. L. ARADHANA<br>12. B. NAGI REDDI |

All Minors—by Trustee:
M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras-600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

1*st March* 1979

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["వామనులు"]కు ఆధారం "రాంబాబు" రచన. నాగరికత అరువుతెచ్చుకునేది కాదని ఈ కథ చెబుతుంది. దానికి అనుకూలించే జీవితవిధానమూ, సాంఘిక విశ్వాసాలూ మొదలైనవి ఉండాలి.

## అమరవాణి

సుకులం, కుశలం, సుజనం విహాయ,
కులకుశల శీలవికలోపి
ఆఢ్యే కల్పతరా వివ నిత్యం
రజ్యంతి జననివహాః.

[మంచి కులమూ, తెలివితేటలూ, మంచితనమూ గలవారిని విసర్జించి జన బాహుళ్యం కులమూ, తెలివీ, మంచితనమూ లేకపోయినా డబ్బుగలవాణ్ణి కల్పవృక్షమైనట్టుగా కొలుస్తారు.]

సంపుటి 64 మార్చి '79 సంచిక 3

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**ఉ. నరసింహమూర్తి, గుమ్మడం (ఆంధ్ర)**

ప్ర : అతీంద్రియశక్తు లంటే ఏమిటి ? వాటి ఉపయోగం ఏమిటి ? అసలు దయ్యాలనేవి ఉన్నాయా ?

న : మనిషికి సాధారణంగా కొన్ని శక్తులు సహజంగా ఉన్నట్టు భావించి, అంతకుమించిన శక్తి ఎవరిలోనైనా ఉంటే దాన్ని అతీంద్రియశక్తి అంటున్నాం. కళ్ళు లేని పుట్టుగుడ్డికి చూడటమనేది అతీంద్రియశక్తి. పిల్లులు మొదలైన నిశాచర ప్రాణులు కటిక చీకటిలో చూడగలవు. మనిషి అలా చూడగలిగితే అది అతీంద్రియశక్తి. అలాగే కుక్కలు కొన్ని ధ్వనులను వినగలవు, వాటిని మనిషి వినలేడు—వింటే వాడిది అతీంద్రియ శక్తి. మనం అతీంద్రియ శక్తులనేవి అనేక ప్రాణులలో ఉన్నాయి. మనుషులలో రకరకాల అతీంద్రియ శక్తులు కనబడతాయి. కాని వాటివల్ల ప్రపంచానికి గల మేలు ఏమీ ఉన్నట్టు కనబడదు. అలాగే దయ్యాల విషయంలో కూడా కొందరు నమ్మకం కనబరిచి, మూఢనమ్మకం గలవాళ్ళు అనిపించుకుంటున్నారు. కాని తద్దినాలు పెట్టేవాళ్ళంతా దయ్యాలున్నాయను కుంటున్నవారే. అయితే, దయ్యాలు లేవనే వారికన్న ఉన్నాయనేవారు గొప్పగా సాధించేది కనబడదు.

**యన్. కనకారావు, పర్లాకిమిడి (ఒరిస్సా)**

ప్ర : దేశంలో అవినీతి ఎక్కువైనకొద్దీ చట్టాలు, శాసనాలు, నీతిసూత్రాలు ఎక్కువవుతూంటాయంటారు. ఇదెంతవరకు నిజం ?

న : పూర్తిగా నిజం. నంఘంలో ఒక రకం అవినీతి ఆరంభమయేదాకా దానికి విరుద్ధంగా శాసనం చెయ్యవలసిన అవసరం కలగదు. ఆస్తిహక్కులు లేని ఆటవికులలో దొంగతనం అన్నది ఉండదు, దానికి శిక్ష కూడా ఉండదు. గోమాంస భక్షణ తొలిగా నిషేధం కావటానికి కారణం ఆనాటికి గోమాంస భక్షణ ఉండటమే. ఈ విధంగా నేరాలు ఎంత ఎక్కువగా ఉంటే శాసనాలూ, చట్టాలూ అంత ఎక్కువగా ఉంటాయి. అవినీతి ఎంత హెచ్చుగా ఉంటే నీతిసూత్రాలు అంత హెచ్చు. మన దేశంలో హిందూస్త్రీలు పరపురుషుల కంటపడటం అవినీతి కాదు. అందుచేత మనకు ఘోషా నీతి లేదు. అది అవినీతి అయిన చోట దానికి శిక్ష కూడా ఉంటుంది.




## 69

రైతుభార్యా, దుష్టుడూ పోతూండగా, వారికి ఒక నది అడ్డు వచ్చింది. అక్కడ పడవ ఉన్నదిగాని, పడవవాడు లేడు.

దుష్టుడు ఆమెతో, "ప్రియా, నేను ముందు నీ డబ్బూ, ఖరీదైన చీరలూ అవతలి ఒడ్డున పెట్టి, తిరిగివచ్చి నిన్ను తీసుకు పోతాను," అన్నాడు.

వాడు అవతలి ఒడ్డుకు చేరి, అటు నుంచి అటే వెళ్లిపోయాడు. ఇంతలో ఆమె ఒక దృశ్యం చూసింది.

ఒక ఆడనక్క నోట మాంసం కరచుకుని వస్తున్నది. అంతలో ఒక పెద్ద చేప ఎగిరి, ప్రమాదవశాన నది ఒడ్డున పడింది. నక్క మాంసం ముక్కను ఒక చోట ఉంచి, చేప కేసి రాసాగింది. నక్కను చూసి చేప, విశ్వప్రయత్నం చేసి తిరిగి నీటిలోకి దూకి, తప్పించుకు పోయింది. నక్క తన మాంసం ముక్క కేసి బయలుదేరింది. అంతలోనే ఒక గద్ద రివ్వుమంటూ వచ్చి, ఆ మాంసం ముక్కను తన్నుకుపోయింది.

మొసలి ఈ కథ ముగించే సమయానికి ఇంకొక జలచరం వచ్చి దానితో, "నీ ఇంటిని మరొక మొసలి ఆక్రమించుకున్నది," అని చెప్పింది.

ఈ మాట విని మొసలి, "విధి నా పట్ల చాలా అన్యాయంగా ప్రవర్తిస్తున్నది. మిత్రుణ్ణి పోగొట్టుకున్నాను, భార్య పోయింది, నా ఇల్లు శత్రువు వశమయింది. ఈ కోతిని సలహా అడుగుతాను," అనుకుని, కోతికి తన సమస్య చెప్పింది.

"నాకు ద్రోహం తలపెట్టిన నువు నా సహాయం పొందటానికి అర్హుడివి కావు," అన్నది కోతి.



దానికి మొసలి, "నీకు అపకారం చేసిన వాడికి ఉపకారం చెయ్యటమే పుణ్యం. అయ్యో! నేనేం చేతును? పెళ్ళాం పోయింది. ఇల్లు పోయింది," అంటూ ఏడ్చింది.

"మూర్ఖుడా, ఇది ఏడుస్తూ కూచునే సమయం కాదు, ఉద్యమించాలి. ధైర్యం వహించి, నీ శత్రువుతో పోరాడు. శత్రువును జయించటానికి సాష్టాంగపడాలి; బలవంతుడైతే, మరొకణ్ణి వాడి మీదికి రెచ్చగొట్టాలి! నీచుడైతే లంచం పెట్టాలి; సమఉజ్జీ అయితే పోరాటానికి దిగాలి. నీకు నక్కకథ చెబుతాను," అంటూ కోతి ఇలా చెప్పింది:

నక్క—నలుగురు శత్రువులు

ఒక అరణ్యంలో మహాచమరక మనే నక్క ఉండేది. ఒకసారి అది అరణ్యంలో తిరుగుతూ, సహజంగా మరణించిన ఒక ఏనుగును చూసింది. నక్క ఏనుగు కళేబరం చుట్టూ ప్రదక్షిణం చేసింది. కాని ఎక్కడా చర్మం చిట్లినట్టు కనిపించలేదు. మందమైన ఏనుగు చర్మాన్ని చీల్చేశక్తి నక్కకులేదు. నక్క ఏమి చెయ్యటానికీ పాలుబోక చూస్తూండగా దానికి ఒక సింహం అటుకేసి వస్తూ కనిపించింది.

నక్క సింహానికి సాష్టాంగ నమస్కారం చేసి, "స్వామీ, తమకోసమే ఈ ఏనుగుకు కాపలా కాస్తున్నాను," అన్నది.

"ఇతరులు చంపిన జంతువును నేను ముట్టను. కనక దీన్ని నువు నా బహుమానంగా పుచ్చుకో," అన్నది సింహం.

ఈ మాటకు నక్క సంతోషించి, "దొడ్డ ప్రభువులు తమ సేవకులను అలాగే చూస్తారు," అన్నది.

సింహం ఈ మాటలకు పొంగిపోతూ తన దారిన వెళ్ళిపోయింది. తరవాత ఒక పెద్దపులి అటుగా వచ్చింది. దాన్ని చూసి నక్క ఇలా అనుకున్నది: "ఒక క్రూరాత్ముడికి ఒంగి దణ్ణాలు పెట్టి తప్పించుకున్నాను. ఈ పెద్దపులిని ఎలా

వదిలించుకోవటం? దీనికీ, సింహానికీ రంధి కల్పించాలి.''

ఇలా అనుకుని అది పులిని సమీపించి రహస్యంగా, ''మామా, ఈ ఏనుగును సింహం చంపింది. అది నన్ను దీనికి కాపుపెట్టి, స్నానం చేసి రాబోయింది. పోతూ పోతూ అది నాతో, 'ఇటుగా పెద్ద పులిగాని వస్తే నువు వచ్చి, రహస్యంగా నాకామాట చెప్పు. నాకు పెద్దపులులంటే తగని మంట,' అన్నది,'' అని చెప్పింది.

ఈ మాట విని పెద్దపులి బెదిరిపోయి, నక్కతో, ''అల్లుడూ, నాప్రాణం కాపాడు,'' అంటూ అమిత వేగంగా పారిపోయింది.



అది వెళ్ళిందో లేదో చిరుతపులి ఒకటి అటుగా వచ్చింది. దాన్ని చూసి నక్క, ''ఈ చిరుతపులి కోరలు చాలా వాడి. దీనిచేత ఈ ఏనుగు చర్మం చీల్పిస్తాను,'' అనుకుని, చిరుతపులితో, ''ఓహో, అల్లుడూ! నా ఆతిథ్యం స్వీకరించి, కడుపునిండా తిను. ఈ ఏనుగును సింహం చంపింది. ఈ కళేబరానికి నన్ను కాపలా పెట్టి వెళ్ళిన సింహం తిరిగి వచ్చేలోపుగా నువు కడుపునిండా తిని, పారిపో,'' అన్నది.

చిరుతపులి,ఏనుగుమాంసం కోసం దాని చర్మం చీల్చింది. ఏనుగు చర్మం చీలిన మరుక్షణం నక్క, ''పారిపో, అల్లుడూ! పారిపో! సింహం వస్తున్నది!'' అని అరిచింది. చిరుతపులి కాలి సత్తువకొద్దీ పరిగెత్తి పోయింది.

నక్క ఏనుగుమాంసం తినటం ఆరంభించిందో లేదో, ఆ మాంసం తినటానికి మరొక నక్క అతివేగంగా వచ్చి పడింది.

మొదటి నక్క దాని పైన కలియబడి, దాన్ని చీల్చి చంపేసి, తాపీగా ఏనుగు మాంసం తిన్నది.

కోతి మొసలికి ఈ కథ చెప్పి, ''శత్రువు ఆక్రమించాడనో, ఆపద సంభవించిందనో, తిండికి కరువు వచ్చిందనో, మరొకందుకో ఎన్నడూ స్వస్థలం విడిచిపెట్టకు. దేశం విడిచిపోయిన కుక్క కథ గుర్తుంచుకో,'' అన్నది.

"ఏమిటా కథ?" అని మొసలి అడిగితే, కోతి ఇలా చెప్పింది:

దేశం విడిచిన కుక్క కథ

ఒక పట్టణంలో చిత్రాంగం అనే కుక్క సుఖంగా నివశించేది. కొన్నిఏళ్ళ అనంతరం, ఆ పట్టణంలో కరువు వచ్చింది, శత్రుభయం కూడా ఏర్పడింది. కుక్కకు తిండి దొరకలేదు. అందుచేత అది సుఖంగా బతకటానికిగాను మరొక పట్టణం పోయింది.

ఒక గొప్ప ఇంటి తాలూకు వంటింటి వాకిలి తెరిచి ఉండటం దానికి కనిపించింది. అది లోపలికి వెళ్ళి చూస్తే, అనేక వంటకాలు తినటానికి సిద్ధంగా కనిపించాయి. అది కడుపునిండా తిని, ఎవరూ చూడకముందే వెళ్ళిపోయింది.

కాని అది బయటికి రాగానే ఊళ్ళో కుక్కలు కొత్త కుక్కను చూసి, మీదపడి కరిచి, హంగామాచేశాయి. చచ్చేటట్టు గాయాలై, కుక్క ఇలా అనుకున్నది: "కరువు వచ్చినా, కాటకం వచ్చినా ఉన్నచోటే ఉండటం మేలు. తినటానికి ఉన్నా, లేకపోయినా బంధువుల ఆదరం ఉంటుంది. పరాయిచోట ఇతర కుక్కల ద్వేషం తప్ప ఇంకేమీ ఉండదు."

కుక్క తన స్వస్థలానికి తిరిగివచ్చింది.

"దేశాంతరం పోయావుగదా, అక్కడ ఎలా ఉన్నది?" అని సాటికుక్కలు అడిగాయి.

"అక్కడ ఎన్నిరకాల తిండి అయినా ఉన్నది. ఎంతో బాగున్నది కూడా. కాని ఆ విదేశీ కుక్కలలో స్నేహభావం లేదు. ఆత్మాభిమానంగల ఈ ఊరికుక్క అక్కడ ఉండటానికి వెళ్ళదు," అన్నది కుక్క.

కోతి ఈ కథ చెప్పి మొసలితో, "నువు నీ ఇంటికి తిరిగి వెళ్ళి, నీ శత్రువుతో దీక్షగా పోట్లాడి చంపి, సుఖంగా ఉండు," అన్నది.

మొసలి దృఢ చిత్తంతో నీటిలోకి దూకి తన శత్రువుతో భయంకరంగా పోట్లాడి, దాన్ని చంపి శాంతి సౌఖ్యాలతో జీవితం సాగించింది.





# భల్లూక మాంత్రికుడు

## 9

[ఏనుగు వెంటబడగా, అంగరక్షకుడు పరిగెత్తుతూ ఉగ్రదండుడి వద్దకు వచ్చే సమయంలో, రాజు దుర్ముఖుడు మూర్ఛ నుంచి లేచి, అరణ్యంలోకి పారిపోయాడు. అక్కడ అతడి మీదికి ఒక చిరుతపులి దూకబోతూండగా, ఆటవికు డొకడు పులిని బాణంతో కొట్టాడు. ఆ దెబ్బకు గాయపడిన పులితోపాటు, దుర్ముఖుడు కొమ్మలమీదినుంచి కిందపడ్డాడు. తరవాత—]

రాజు దుర్ముఖుడూ, డొక్కలో బాణం గుచ్చుకున్న చిరుతపులీ కొమ్మమీది నుంచి కింద పడటం చూస్తూనే అంగరక్షకుడు ఎగిరి ఒక గంతువేసి, ఆటవికుడితో, "ఒరే, అలా చూస్తావేం? మరొక బాణం కొట్టి చిరుతపులిని చంపెయ్యి," అంటూ కేక పెట్టాడు.

దుర్ముఖుడు చెట్టు మీది నుంచి ఒక పొద మీదపడి, అక్కడి నుంచి నేలపైకి జారటం వల్ల, అతడికి బలమైన దెబ్బలేమీ తగలలేదు.

అంగరక్షకుడు చిరుతపులి కేసి ఓమారు చూసి, "మహారాజా, బలమైన బాణం దెబ్బతిన్నా, పులి యింకా మీ మీదికి దూకే ప్రయత్నంలోనే వున్నట్టున్నది, ఇప్పుడేం చేయటం?" అన్నాడు.

రాజు దుర్ముఖుడు పులినుంచి దూరంగాపోయి, కసిగా అంగరక్షకుడి



కేసి చూస్తూ, ''ఒరే, నీ కేమన్నా మతి పోయిందా ఏం! వెంటనే కత్తి దూసి దాని తల నరుకు. ఈ ఆటవికుడు మన రాజ్యం వాడేనా? ఒట్టి బుద్ధిహీనుడిలా వున్నాడు,'' అన్నాడు.

ఇప్పుడు చిరుతపులికి కొంచెం దాపులలో వున్నవాడు దుర్ముఖుడే. అది కోరలు చాచి ఒక్కొక్క అడుగేవేస్తూ, అతడి కేసి బయలుదేరింది. అప్పటివరకూ అంతా మౌనంగా చూస్తూ నిలబడివున్న ఆటవికుడు ఏదో గ్రహించినవాడిలా చిన్నగా నవ్వి: ''నేనెంత బుద్ధిహీనుణ్ణయినా బంగారు వరహాలంటే తెలియనివాణ్ణి కాదు. నా కిస్తానన్న ఐదు వరహాల మాటేమిటి?'' అని బాణాన్ని అంగరక్షకుడి కేసి ఎక్కుపెట్టి, ''నువ్వీయన్ని మహారాజా అని పిలుస్తున్నావు. అదేమైనా హాస్యమా లేక ఆయన నిజంగానే మహారాజా?'' అని అడిగాడు.

చిరుతపులి మరొకసారి రాజు దుర్ముఖుడి మీదికి దూకే ప్రయత్నం చేస్తున్నదని గమనించిన అంగరక్షకుడు కత్తి దూసి రాజుతో, ''మహారాజా, మీరు కూడా ఒరలోంచి కత్తి లాగండి. దెబ్బ తిన్న ఆ చిరుతపులిని మనిద్దరం ఏకమై చంపటం ఏమంత కష్టం కాదు,'' అంటూ ఒకడుగు ముందుకు వేశాడు.

ఆ వెంటనే ఆటవికుడు బాణాన్ని అంగరక్షకుడి ముందు భూమిలో గుచ్చుకునేలా కొట్టి, మరొక బాణం తీసి అతడి కేసి ఎక్కుపెట్టి, ''నేనడిగినదానికి జవాబు చెప్పావుకాదేం? నా బాణం దెబ్బ నీ ప్రాణాలు తీస్తుంది. చిరుతపులి, నువు రాజనే వాడి గొంతు కొరికి, ఏ వాగు ఒడ్డుకో పోయి గాయం బాధతో చచ్చిపోతుంది,'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు కత్తి దూసి చిరుతపులి కేసి ఒకడుగు వేయబోయినవాడల్లా ఆఖరిక్షణంలో భయపడి, వెనక్కు నడుస్తూ, ''ఒరే, ఆటవికుడా! నేను ఉదయగిరి రాజునైన దుర్ముఖుణ్ణి. విధి

వక్రించి యిలా అరణ్యాలు పట్టి యాతనల పాలయాను. నీ బాణం దెబ్బ చిరుతపులి ఆయువుపట్టులో తగిలినట్టు లేదు. మరొక బాణంతో దాన్ని చంపు.'' అన్నాడు.

''ముందే అలా సెలవిచ్చారుకాదేం? సైన్యం వెంట లేకుండా అరణ్యంలోకి రావటం పెద్ద పొరబాటు, మహారాజా!'' అంటూ ఆటవికుడు బాణాన్ని అంగ రక్షకుడి దిక్కునుంచి, చిరుతపులి కేసి తిప్పి వదలబోయేంతలో అది, గట్టిగా ఖాండ్రించి రాజు కేసి దూకింది. ఆటవి కుడు వదిలిన బాణం గురి తప్పి, చెట్టు బోదెకు గుచ్చుకున్నది.

రాజు దుర్ముఖుడు పులి తన మీదికి లంఘించబోయేంతలో ఒక చావు కేక పెట్టి, వెనుదిరిగి పరుగు పుచ్చుకున్నాడు. చిరుతపులి అతడి వెంట బడింది. అలా వాళ్లు చెట్లల్లో కొద్ది దూరం పరిగెత్తేంతలో, అటుకేసి వస్తున్న రాక్షసుడు ఉగ్ర దండుడు చప్పున రాజును ఒక చేత్తో పట్టుకుని ఆపి, ''వెధవ చిరతపులిని చూసి భీరువులా పరిగెత్తుతున్నావా? నీ వేమన్న రాజువు?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు నిలువెల్లా వణికి పోతూ ఏదో అనబోయేంతలో గాయం బాధతో రెచ్చిపోయి వున్న పులి వేగంగా



అతణ్ణి సమీపించింది. ఉగ్రదండుడు చిరుతపులిని కాలితో పైకి ఎగిరేలా తన్ని, అది కిందపడబోయేంతలో దాని మెడ పట్టుకుని, ''దేశాన్ని పాలించే నీ కన్న అరణ్యాల్లో తిరిగే యీ క్షుద్రజంతువే ఎక్కువ ధైర్యశాలిలా వున్నది,'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు, రాక్షసుడి పట్టు నుంచి బయట పడేందుకు గింజుకుంటూ, ''అవును, ఉగ్రదండా, ఇందులో ఆశ్చర్య మేమున్నది? నేను రాజును, అది నీ వన్నట్టు కేవలం క్షుద్రజంతువు,'' అన్నాడు.

ఆ మరుక్షణం దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి ఇద్దరు అనుచరులూ,

బతికున్నంతవరకూ యిలా భల్లూకంగానే వదిలివేయటమో చేసి తీరుతాడు. అప్పుడు నేనేం కాను?'' అన్నాడు.

''అదీ నిజమే! మరి దారేమిటి?'' అన్నాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

అంగరక్షకుడు వణుకుతూ ఉగ్రదండుడి ముందుకు వచ్చి నిలబడి, ''దండ మహారాజా, నా సలహా ఒకటున్నది. మహారాజుగారిని ప్రాణాలతోనే ఆ మాంత్రికుడి దగ్గిరకు తీసుకుపోవటం బావుంటుంది. అతల సంగతేదో అక్కడ ఆ మాంత్రికుడే చూసుకుంటాడు,'' అన్నాడు.



''ఈ ఆలోచన మహబావుంది. తలారి భల్లూకా, ఏమంటావు?'' అని అడిగాడు ఉగ్రదండుడు.

''ఇంత మహారణ్యం దాటించి, యీ రాజును భల్లూకమాంత్రికుడి దగ్గిరకు తీసుకుపోవటం అంత తేలిగ్గాదు. ఇతడు ఏక్షణాన్నయినా, నా నుంచి పారిపోవచ్చు. ఇంతకుముందే అలాంటి ప్రయత్నం చేసి, చిరుతపులి పుణ్యమా అని మళ్ళీ దొరికాడు. ఇక యితణ్ణి వదలను,'' అంటూ తలారి భల్లూకుడు రాజు దుర్ముఖుడి కేసి ఒకడుగు వేశాడు.

దుర్ముఖుడు కీచుమంటూ అరిచి, ఉగ్రదండుడి వెనక్కుపోయి నిలబడుతూ, ''ఉగ్రదండ మహాప్రభో శరణు! శరణు!'' అన్నాడు.

''అభయం యిచ్చాను భయపడకు!'' అని, ఉగ్రదండుడు, తలారిభల్లూకుడితో, ''భల్లూకా, యీ రాజును నీ వెంట మాంత్రికుడి దగ్గిరకు తీసుకు రావటానికి నేను బాధ్యత వహిస్తాను. నువ్వు, నీ వాహనమైన మొండి తొండపు ఏనుగు మీద బయలుదేరు. ఈ రాజుతోపాటు వెంట నేను నడుస్తాను,'' అన్నాడు.

''ఘాట తప్పవుగదా, ఉగ్రదండా? ఇదే పోయి, నా వాహనానికి కట్టిన తాళ్లు నరికి, యిక్కడి కొస్తాను,'' అంటూ తలారి భల్లూకుడు బయలుదేరాడు.



దాని చుట్టూ గిరికీలు తిరుగుతూ, మధ్య మధ్య పంజాతో ఏనుగు తలమీద కొట్టేందుకు ప్రయత్నిస్తున్నది. ఏనుగు ఘీంకరిస్తూ తెగిన తొండాన్ని సింహంకేసి చాచి, కాళ్ల బంధాలను తెంచుకునేందుకు నానా తంటాలూ పడుతున్నది.

తలారి భల్లూకుడు యిది చూస్తూనే రౌద్రంగా ఒక కేకపెట్టి, "అహాఁ, నా అంత వాడి వాహనాన్నే తిన చూస్తున్నావా?" అంటూ గండ్రగొడ్డలి ఎత్తి సింహం మీదికి దూకాడు.

సింహం యీ వింత ఎలుగుబంటును చూసి, చిన్నగా బెదిరి పక్కకు రెండడుగులు వేసింది. కాని అంతలోనే తలారి భల్లూకుడు గండ్రగొడ్డలితో వేగంగా వచ్చి పైబడబోయేంతలో, కోపంతో రెచ్చిపోయి, గర్జిస్తూ అతడి మీదికి ఎగిరింది. ఆ సమయంలో తలారి భల్లూకుడు విసిరిన గండ్రగొడ్డలి దెబ్బ గురితప్పి దాని వెనక కాళ్ళలో ఒకదానికి తగిలింది. వెంటనే సింహం కిందపడి లేచి, మరొకసారి తలారి భల్లూకుడి మీదికి లంఘించబోయేంతలో వెనక వున్న ఆటవికుడు గురిగా దాని గుండెల్లో తగిలేలా బాణం వదిలాడు.

అతడికి వెనగ్గా ఆటవికుడు విల్లుకు అంబు తొడిగి గబగబా నడుస్తూ, "ఓయ్, తలారి భల్లూకం! తొందరపాటులో అజాగ్రత్తగా ఆ ఏనుగును సమీపించకు. మాటల ధోరణిలోపడి, ఆ ఏనుగూ, ఒక సింహం చిన్నగా ఘీంకార, గర్జనలు చేస్తూండటం మీరు వినలేదు. ఈ పాటికి ఏనుగు కుంభస్థలాన్ని సింహం బదాబదలు చేసినా చేసి వుండొచ్చు," అన్నాడు.

"నిజమా!" అంటూ తలారిభల్లూకుడు అదిరిపడి, పరుగు పరుగున ఏనుగు వున్న చోటుకు చేరేంతలో, ఆటవికుడు చెప్పినట్టుగానే, కాళ్లు బంధింపబడిన ఏనుగు మీద పడేందుకు సింహం ఒకటి,

బాణం దెబ్బ తింటూనే సింహం పక్కకు పడిపోయింది. అది భీకరంగా

గర్జిస్తూ తిరిగి లేవబోయేంతలో తలారి భల్లూకుడు, గండ్రగొడ్డలితో దాని కంఠం మీద బలంగా కొట్టాడు.

సింహం లేచినిలబడే ప్రయత్నం చేసి, కంఠం సగం తెగిపోవటంతో పక్కకు పడిపోయి గిలగిలా తన్నుకో సాగింది. గొడ్డలి ఎత్తి మరోసారి కొట్ట బోతున్న తలారి భల్లూకుడి చేయి పట్టుకుని ఆటవికుడు, "ఆహా, భల్లూకయ్యా, ఏమి నీ సాహసం! సింహం చచ్చిన దాని కిందే లెక్క. మరోసారి గండ్రగొడ్డలితో కొట్టి, దాని చర్మం పాడుచెయ్యకు. దాని జూలూ, చర్మం నాకాక్కావాలి," అన్నాడు.

తలారి భల్లూకుడు ఆయాసపడుతూ ఆటవికుడి కేసి చూసి, "నీ బాణం గురి కూడా అమోఘమైనది. నీవు ఒంటరిగాడి వైతే, యీ అరణ్యం వదిలి నా వెంట చంద్రశిలానగరం రారాదా! అక్కడ నీకు రాజుగారితో చెప్పి, నా కింద ఉపతలారి నౌకరీ యిప్పిస్తాను," అన్నాడు.

ఆటవికుడు తలవంచి, "నేను, నీ వెంట నగరానికి వస్తాను. చేస్తే, నీలాంటి మహాసాహసి దగ్గిరే ఉద్యోగం చేయాలి," అన్నాడు.

తలారి భల్లూకుడు ఏదో అనబోయేంతలో రాక్షసుడు ఉగ్రదండుడు, మిగతా వాళ్ళతో కలిసి అక్కడికి వస్తూ,



"ఇక్కడ యింత గొడవ జరిగిపోయిందన్నమాట! తలారి భల్లూకుడికి తగిన సేవకుడే దొరికాడు," అన్నాడు.

ఆ మాటలకు ఉప్పొంగిపోయిన తలారి భల్లూకుడు గండ్రగొడ్డలి పైకెత్తి, "ఒరే, అడవిదొంగ నాగమల్లూ! నువ్వూ, నీ నేస్తగాళ్ళూ కలిసి తక్షణం నా వాహనం కాళ్ళకు కట్టిన తాళ్ళు ఊడదీయండి," అన్నాడు.

"తలారి భలూక దొరా, అలాగే చేస్తాం. కాని, ఏనుగు కట్లు వూడగానే మమ్మల్ని తొక్కి చంపకుండా కాపాడే బాధ్యత మీది," అన్నాడు దొంగల నాయకుడు నాగమల్లు.

"నా చెప్పుచేతల్లో వున్న వాహనం, నా అనుమతి లేకుండా యితర్లకు హాని కలిగించటమా?" అంటూ తలారి భల్లూకుడు, అడవి దొంగలు ఏనుగు కాళ్ళ కట్లు విప్పుతూండగానే, ఆ తాళ్లతో దాని మెడకు గట్టిగా ఉచ్చు బిగించి, దాని వీపు మీద ఎక్కి కూర్చున్నాడు.

మొండి తొండపు ఏనుగు తన బంధపు తాళ్ళన్నీ ఊడిపోగానే ఘీంకరిస్తూ లేచి నిలబడింది. తలారి భల్లూకుడు, ఆటవి కుణ్ణి చేఎత్తి పిలుస్తూ, "ఒరే, ఆటవిక సేవకా, నువ్వీ అరణ్యమార్గాలన్నీ బాగా ఎరిగినవాడివిగదా? వచ్చి, నా వాహనం కుంభస్థలం మీద కూర్చుని, చంద్రశిలా నగరానికి దారి తియ్యి." అని రాక్షసుడు ఉగ్రదండుడితో, "ఆ రాజు దుర్ముఖుణ్ణి పారిపోకుండా, నా వెంట తెచ్చే బాధ్యత నీది, అవునా?" అని అడిగాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు తల ఊపుతూ, "నాకూ, నువ్వనే భల్లూక మాంత్రికుడితో పని వున్నది. మొండి ఏనుగు మీద ముందుండి దారి తియ్యి. ఇక్కడవున్న వాళ్ళం అందరం నీ వెంట వస్తాం. ఇష్టం లేనివాళ్ళు అరణ్యం దాటగానే, ఎవరి దారిన వాళ్ళు వెళ్ళి పోవచ్చు." అన్నాడు.

"భేషైన మాట! రాజు దుర్ముఖుడు తప్ప, మిగతా వాళ్ళందరికీ యీ క్షణానే స్వేచ్ఛ యిస్తున్నాను; కావాలంటే యిక్కడి అరణ్యమృగాల మధ్య హాయిగా బతకవచ్చు." అంటూ తలారి భల్లూకుడు ఏనుగును అదిలించి, ముందుకు పరిగెత్తించాడు.

మొండితొండపు ఏనుగు అలా పరుగు పుచ్చుకోవటంతో, ఉగ్రదండుడూ మిగతా వాళ్ళూ కొంచెం వెనకబడిపోయారు. తలారి భల్లూకుణ్ణి, హఠాత్తుగా చెట్ల చాటునుంచి వచ్చిన రెండు ఏనుగులు అడ్డగించినై. వాటి మీద వున్న నలుగురు సైనికులు, "ఉదయగిరి మహారాజుకూ, జై!" అంటూ అతడి కేసి బాణాలు వదలసాగారు. —(ఇంకా వుంది)






# వామనులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే శ్మశానం కేసి మౌనంగా బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఎవరిని ఉద్ధరించటానికి ఇలా శ్రమపడుతున్నావో తెలియదుగాని, కొందరు పైకి రావటానికి ఎంతమాత్రమూ ఇష్టపడక, తమను ఉద్ధరించేటందుకు ప్రయత్నించిన వాళ్లను శత్రువులుగా కూడా చూస్తారు. ఇందుకు నిదర్శనంగా వామనులు అనే ఆటవికజాతివారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

వామనులు హిమగిరి అరణ్యాలలో నివసించిన ఒక జాతివాళ్ళు. వారి జీవిత విధానం అరణ్యానికి, వారి అవసరాలు అరణ్యంలో దొరికే సంపదకూ అను

## బేతాళ కథలు

కూలంగా ఏనాడో అమరటం చేత, ఎన్ని వందల ఏళ్ళు గడిచినా వారి జీవితంలో మార్పులేదు. వారికి నాగరికత గురించి ఏమీ తెలీదు.

అయితే వారి నాయకుడైన పులిదొర కొడుకు కొండడు అనేవాడు, దూరాన ఉన్న విజయపురి రాజ్యానికి వెళ్ళి, అక్కడి నాగరికత గురించి తెలుసుకుని, అలాటి జీవితం గడపాలన్న ఆశతో, విజయపురి రాజైన చండసేనుడి కొలువులో చేరాడు.

కొంతకాలం గడిచింది. కొండడికి తన తండ్రిని చూడాలనిపించింది. అంతే గాక, తాను పూర్తిగా అర్థం చేసుకున్న నాగరికతను తన జాతికి చెందిన వామనులలో ప్రవేశపెట్టి, వారిని పైకి తేవాలని కూడా కొండడు గాఢంగా వాంఛించాడు.

కొడుకు తనతో చెప్పకుండా వెళ్ళిపోయి నప్పటినుంచి పులిదొర, తన కొడుకు మీద పెట్టుకున్న ఆశలన్నీ కూలిపోగా, బెంగపడి మంచం పట్టాడు. తిరిగి కొడుకు కనపడగానే అతను ప్రాణం లేచివచ్చి నట్టయి, "నాయనా, నేను చెప్పినట్టు మన జాతికి నాయకుడివిగా ఉండు!" అని కొడుకు భుజంతట్టి, కిందపడి ప్రాణం వదిలాడు.

వామనులు పులిదొర ఆశయాన్ని పాటించి కొండణ్ణి తమ కొత్త నాయ కుడుగా స్వీకరించారు.



అయితే కొండదొర తన జాతికి నాయకుడు అవుతూనే తమ అరణ్యాన్ని నరకమని ఉత్తరువు ఇచ్చాడు. వామనులకిది వట్టి ఉన్మాదంగా తోచింది. అయినా నాయకుడి ఆజ్ఞ శిరసావహించి, వాళ్లు అరణ్యాన్ని నరికారు.

కొండదొర అరణ్యం నరికించి, కలపనూ, ఇతర వస్తువులనూ విజయపురికి పంపి అమ్మించి, ఆ డబ్బుతో వామనులకు ఆధునికమైన ఇళ్ళూ, ఇతర నాగరిక సౌకర్యాలూ కలిగించటానికి పూనుకుని, వాళ్ళ పాత గూడెం నాశనం చేయించాడు. హిమగిరి అరణ్యాలు హిమపురిగా మారాయి. కొండదొర తన జాతివాళ్ళను విజయపురికి వెళ్లి, నాగరికమైన వృత్తులు చేసుకుని, డబ్బు సంపాదించమన్నాడు.

వామనులకు నాగరికత నచ్చలేదు. లోగడ తాము ఉపయోగించే వస్తువులు కరువయాయి. ఇప్పుడు ప్రతిదానికీ డబ్బు కావాలి. కాని వామనులు కోరే అటవీ సంపద డబ్బుకు కూడా దొరకటం లేదు. అడవి పోగానే అవీ పోయాయి. వాళ్ళ జాతి జీవితంలో మొదటిసారిగా వామనులు పస్తులుండే పరిస్థితి కూడా ఏర్పడింది.

వామనులలో మల్లు అనేవాడు బయలుదేరి కొండదొరకు వ్యతిరేకంగా వామనులను రెచ్చగొట్టసాగాడు. అది చూసి కొండదొర భయపడి, వామనులకు





కావలసిన అటవీసంపదను విజయపురి రాజు సహాయంతో తెప్పించి, హిమపురిలో దుకాణాలలో అమ్మించనారంభించాడు. అయితే అవి అందరికీ చాలేవి కావు. వాటికోసం జనం ఎగబడి తొక్కిసలాడుకునేవారు. అయినా కొందరికి అవి లభించేవికావు.

దీన్ని గురించి మల్లు కొండదొర దగ్గిర ఆక్షేపణ తెలిపాడు. అప్పుడు కొండదొర ఒక చిత్రమైన ఏర్పాటు చేశాడు: మితంగా లభించే అటవీసంపదను మనిషికి ఇంత చొప్పున అని లెక్కకట్టి, పంచాడు. అలా పంచగా వచ్చిన సరుకు ఎవరికీ సరిపోకపోయింది.

మల్లుకు ఒక అనుమానం పట్టుకున్నది. తమ అడవులు ధ్వంసం కాగా అటవీ సంపద అంతా పోయిందిగదా, ఇప్పుడు వచ్చే ఈ సరుకు ఎక్కడినుంచి వస్తున్నది? మల్లు ఈ విషయం ఆరా తీయగా, ఆ వస్తువులను చండసేన మహారాజుగారు పంపుతున్నాడనీ, అయితే అవి విజయపురిలో దొరకవనీ, విజయపురికి సమీపంలో ఉండే మందగిరి అరణ్యాలలో దొరుకుతాయనీ తెలిసింది.

మల్లు వామనుల నందరినీ మందగిరికి పదమన్నాడు. వాళ్ళు కూడా మల్లుదొర నాయకత్వం కింద మందగిరి అరణ్యాలలో తమ స్థావరం ఏర్పాటు చేసుకుని, పూర్వంలాగే సుఖంగా జీవించ నిశ్చయించారు.

ఈ సంగతి తెలిసి కొండదొర, మల్లుదొర నాయకత్వం కింద తాను కూడా మందగిరి అరణ్యాలకు వస్తానన్నాడు. కాని వామనులు అతన్ని జాతినుంచి పూర్తిగా వెలివేసి, "నువు మాతో ఉండ తగవు!" అని, మల్లుదొర వెంట వెళ్ళిపోయారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కొండదొర వామనులకు అన్ని కష్టాలు ఎందుకు తెచ్చిపెట్టాడు? వామనుల జీవితవిధానం మీద అసహ్యం పుట్టినట్టే,

వామనుల జాతి మీద కూడా అసహ్యం పుట్టిందా? వామనులు ఆటవిక జీవితాన్ని వదిలిపెట్టి నాగరికత అలవరచుకోవటానికి ఎందుకు నిరాకరించారు? నాగరికత ఒక మెట్టు పైదే గదా! తమను నాగరికులను చెయ్యటానికి ప్రయత్నించినందుకు కొండదొర మీద కృతజ్ఞత లేకపోగా, అతన్ని వాళ్ళు ఎందుకు వెలివేశారు? ఆటవికులలో వెలికన్న పెద్ద శిక్ష లేదుగదా! ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కొండదొర తాను ఉన్నత సంస్కారం అని గుర్తించిన నాగరికతను తన జాతికంతకూ కలిగించాలని ప్రయత్నించాడు. అంతేగాక చిట్టచివరకు వాళ్ళు మల్లుదొరను నాయకుడుగా ఎన్నుకున్నప్పుడు వాళ్ళ వెంట మామూలు మనిషిగా వెళ్ళటానికి కూడా సిద్ధమయాడు. వీటినిబట్టి కొండదొరకు స్వజాతి మీద ఎంత అభిమానం ఉన్నదీ స్పష్టంగా తెలుస్తుంది. చివరలో వామనులు అతన్ని వెలివెయ్యటం వాళ్ళ దృష్టిలో పెద్ద శిక్ష కావచ్చుగాని, కొండడికి పెద్ద శిక్ష కాదు. అతను సంస్కారం రీత్యా వామనులకు ఎప్పుడో వెలి అయాడు. అతను నాగరిక జీవితం జీవించగలడు కూడా. పోతే వామనులు నాగరికతను నిరాకరించటానికి కారణం ఉన్నది. వారి అవసరాలూ, ఆచారాలూ, నమ్మకాలూ నాగరికతకు అనువుగా ఉండేవి కావు. ఆటవిక జీవితం వారికి పూర్తి సంతృప్తిని ఇస్తున్నంత కాలమూ, అందులో వీసమెత్తు మార్పును కూడా వాళ్ళు సహించరు. ఈ సంగతి గ్రహించక, తనలో ఎలాటి భావపరివర్తన కలగటంచేత తనకు నాగరికత నచ్చిందో గుర్తించక, కొండడు వామనులకు కష్టాలు తెచ్చి పెట్టాడు.'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# విందు

పైడయ్య మహాలోభి. అయితే అతన్ని వేళాకోళం చెయ్యటానికి ఎవరో, అతను విందు చెయ్య బోతున్నాడని పుకారు లేపారు. కాని పైడయ్య సంగతి అందరికీ తెలుసు గనక ఎవరూ నమ్మలేదు.

రంగడు అనేవాడు ఈ విందు నిజమో, అబద్ధమో తేల్చుకుందామని, పైడయ్య ఇంటికి వెళ్ళి, పైడయ్య నౌకరును, "ఏమయ్యా, మీ యజమాని ఊళ్లోవాళ్ళకు విందు చేస్తున్నా డన్నారు, నిజమేనా ?" అని అడిగాడు.

దానికి నౌకరు, "మా యజమాని విందు ఇచ్చేమాట నిజమేగాని, ఇంతలో కాదు. ప్రళయం నాడు తప్పక విందు ఇస్తారు," అన్నాడు.

అప్పుడే ఇంట్లో నుండి బయటికి వచ్చిన పైడయ్య ఈ మాటలు విని, "ఆ విందు ఎప్పు డిచ్చేదీ నిర్ణయించటానికి ఇప్పుడే ఏం తొందర వచ్చిందిరా?" అని నౌకరు మీద కసురుకున్నాడు.

—ఫణి





# మాయవర్తకుడు

సుబ్బిశెట్టి కొంతకాలంగా ఇల్లు కొనాలని కోరుతున్నాడుగాని, తనకు కావలసిన పంపిణీలో కట్టిన ఇల్లు ఏమన్నా కారు చౌకగా అమ్మకానికి వస్తే కొందామని ఎదురుచూస్తున్నాడు.

"మీ పిసినిగొట్టుతనంతో మనకు ఇల్లు కొనే యోగ్యత లేదు. ఎక్కడన్నా ఇంత స్థలం కొనండి, ఒక చిన్న పాక వేసు కుందాం," అన్నది సుబ్బిశెట్టి భార్య.

ఇంతలో పొరుగు గ్రామంలో ఒక అందమైన భవంతి అమ్మకానికి వచ్చింది. ఇల్లు గల ధనికుడు వర్తకం మీద దేశాంతరాలకు పోతూ, చిన్న రాజభవనం లాటి ఇంటిని సుబ్బిశెట్టికి కారుచౌకగా అమ్మి, ఇంటితాళపు చెవులు ఇచ్చేసి వెళ్ళిపోయాడు.

సుబ్బిశెట్టి మంచి రోజు చూసి, తాను కొన్న ఇంట గృహ ప్రవేశం జరిపే ప్రయత్నాలు చేద్దామని పొరుగూరు వెళ్లితే, అప్పటికే నలుగురు మనుషులు సింహ ద్వారం వద్ద కీచులాడుకుంటూ కనిపించారు. వాళ్ళందరూ ఆ ఇల్లు కొనుక్కున్న వాళ్ళేనని శెట్టికి తెలియ వచ్చింది. శెట్టి అయిదోవాడు!

ఇంతలో ఆ ఇంటి ముందు ఒక గుర్రపు బండీ వచ్చి ఆగింది. అందులో నుంచి ఒక జమీందారు దిగి, సింహ ద్వారం వద్ద ఘర్షణ పడుతున్నవారిని, "మీరంతా ఎవరు? మా ఇంటి ముందు మీకేం పని?" అని అడిగాడు.

అయన దూరపు గ్రామంలో ఉండి ఈ గ్రామంలో ఆ ఇంటిని కొత్తగా కట్టించు కున్నాడట. అయన చూపిన పత్రాలవల్ల అయన అన్నమాట నిజమేనని తేలి పోయింది. సుబ్బిశెట్టి మిగిలిన వాళ్ళతో, "అందరమూ మోసపోయాం! పదండి,

ఎమ్. వి. వి. సత్యనారాయణ

మనకు ఈ భవంతి అమ్మినవాణ్ణి పట్టు కుందాం. మన సొమ్ము తిరిగి ఇయ్యకేం జేస్తాడు?'' అన్నాడు.

కాని ఆ మనిషి జాడ దొరకలేదు. సుబ్బిశెట్టి తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఆ సాయంత్రమే సుబ్బిశెట్టి ఇంటికి అతని బావమరది వరహాలశెట్టి వచ్చాడు. వస్తూనే, ''ఏం, బావా? కొత్త ఇంటి గృహ ప్రవేశం ఎప్పుడు?'' అని అడిగాడతను.

సుబ్బిశెట్టి తన బావమరిదికి జరిగినదంతా వివరంగా చెప్పాడు.

వరహాలశెట్టి నవ్వు ఆపుకుంటూ, ''కాకపోయినా, నువు చేసిన పెట్టుబడికి విశాలమైన స్థలమే రాదుగదా, అలాటి భవంతి వస్తుందని ఎలా అనుకున్నావు?'' అని అడిగాడు.

సుబ్బిశెట్టి దుఃఖం ఆపుకుంటూ, ''అవును. దురాశకు పోయాను. అయితే నాలాటి దురాశాపరులు ఇంకా నలుగురున్నారు,'' అన్నాడు.

తెల్లవారుతూనే వరహాలశెట్టి వెళ్ళిపోయాడు. ఆ సాయంత్రమే, సుబ్బిశెట్టికి భవంతిని అమ్మినవాడు వచ్చాడు. అతన్ని చూసి సుబ్బిశెట్టి చిందులు తొక్కాడు, ''నువు పచ్చి మోసగాడివి!'' అని తిట్టాడు.

ఆ మనిషి నవ్వి, ''మోసగాడినైతే నిన్ను వెతుక్కుంటూ మళ్ళీ ఎందుకు వస్తాను? నీ సొమ్ముకు సరిపడే ఇళ్ళ స్థలం కొన్నాను, తీసుకుంటావా?'' అని అడిగాడు.

సుబ్బిశెట్టిలో ఆశ చిగురించింది. ఆ మనిషి స్థలం తాలూకు పత్రాలు సుబ్బిశెట్టికి ఇచ్చి వెళ్ళిపోయాడు. శెట్టి ఆ స్థలంలో ఇల్లు కట్టుకుని, అందులో గృహప్రవేశం చేశాడు.

తన బావమరిది చేత ఇల్లు కట్టించటానికి వరహాలశెట్టే నాటకం ఆడాడనీ, ఆ భవంతిని కొన్నట్టు నటించిన నలుగురూ అతని మిత్రులేననీ సుబ్బిశెట్టికి చాలా కాలం తెలియదు.



# మందులేని జబ్బు

కాంచీపురం రాజు భార్య మంచానపడింది. ఎంతలేసి వైద్యులూ ఆమె జబ్బునయం చెయ్యలేక పోయారు. ఆమె వ్యాధి కుదిర్చిన వారికి ఒక గ్రామం ఇస్తానని రాజు ప్రకటించాడు. ఈ మాట విని యజ్ఞదత్తుడనే ఘనవైద్యుడు రాహులుడు అనే శిష్యుడితో సహా వచ్చి, రాణిని చూసి, ఆమెది మనోవ్యాధి అనీ, చికిత్సకు లొంగదనీ గ్రహించాడు.

గురువుగారు ఐనలో ఈ సంగతి చెబితే, రాహులుడు కొంచెం ఆలోచించి, తనను కూడా రాణీ దగ్గిరికి తీసుకుపోయి, హస్తసాముద్రికం తెలిసిన జ్యోతిష్కుడుగా పరిచయం చెయ్య మన్నాడు. రాణికి పిల్లలులేరు. మనోవ్యాధికి అదేకారణం కావచ్చు.

రాహులుడు రాణి చెయ్యి చూసి, "గురువుగారూ, మహారాణిగారికి సంతానయోగం ఉన్న దండీ. పెద్ద యెత్తున యజ్ఞాలుచెయ్యాలి," అన్నాడు.

రాణి ఎంతో సంతోషంతో మంచంలో లేచి కూర్చుని, "నాకు పిల్లలు నిజంగా కలుగు తారా?" అని అడిగింది.

"కలుగుతారు గాని, ఏం లాభం, మహారాణీ? వారి మూలంగా మీ భార్యాభర్తలకు ఎడ బాటు తప్పదు," అన్నాడు రాహులుడు.

రాణి కుంగిపోయి, "ఐతే ఏం చెయ్యాలి?" అన్నది.

"పిల్లలను దత్తుచేసుకుంటే సంతానయోగం ఫలిస్తుంది," అన్నాడు రాహులుడు.

రాణి మనోవ్యాధి క్రమంగా నయమయింది. రాజు గురుశిష్యులకు అగ్రహారం ఇచ్చాడు.

—ఎస్. అగ్రవాల్





# సఖ్యత కుదిరింది

కేశవుడికి చిన్నతనంలోనే తండ్రి పోతే, తల్లి వెంకాయమ్మ పెంచి పెద్దచేసి, సుశీల అనే చక్కటి పిల్లను తానే ముచ్చటపడి ఏరి తెచ్చి పెళ్ళిచేసింది.

కొంతకాలంపాటు అత్తా: కోడళ్లు సఖ్యంగానే ఉన్నారు. కాని క్రమంగా ఇద్దరిమధ్యా చిన్న, చిన్న కీచులాటలు ప్రారంభమై, క్రమంగా శ్రుతి హెచ్చింది. ఇందుకు కారణం కేశవుడిమీది హక్కు కోసం అత్తా కోడళ్లు తమకే తెలియకుండా పోటీ పడటమే కావచ్చు. ఇద్దరూ కేశవుడికి, ఒకరిమీద ఒకరు, చాడీలు చెప్పనారంభించారు. అత్తా, కోడళ్ళ వైరం చిలికి, చిలికి గాలివాన అయినట్టుగా తయారయింది. రానురాను వాళ్ళు, కేశవుడితో నిమిత్తం లేకుండా, ముఖాముఖి యుద్ధానికి తలపడసాగారు. వాళ్ళను సమాధాన పరచటానికి కేశవుడు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. చిట్టచివరకు కేశవుడు తనగోడు ఒక స్నేహితుడితో చెప్పుకుని, అతను చెప్పిన సలహాను అమలులో పెట్టాడు. అతను తన భార్యతో, "నువ్వు చాలాకాలంగా మీవాళ్ళను చూడాలంటున్నావు. నాకే తీరికలేక ఇంతకాలమూ జాప్యం చేశాను, బయలుదేరు, మీ పుట్టింటికి పోదాం!" అన్నాడు.

పుట్టింటికి వెళ్ళాలని ఉన్నదని సుశీల చాలాసార్లు భర్తతో అన్నమాట నిజమే. కేశవుడేవాయిదా వేస్తూ వచ్చాడు. ఇప్పుడు అతను తనంతట తానే ప్రయాణం కట్టేసరికి ఆమెకు చాలా ఆనందం కలిగింది. అదీగాక ఆమెకు రోజూ అత్తగారితో పోట్లాడటం తప్ప, సుఖంగా గడిచిన రోజు లేదు. కొంతకాలం తనవాళ్ల మధ్య ఉండే

బొమ్మిడి అచ్చారావు

ఆనందంతో బాటు అత్త పెట్టే కోరంటికం మరిచిపోయి, హాయిగా ఉందామని ఆమె అనుకున్నది.

కేశవుడు తన భార్యను పుట్టింట దించి అత్తవారు ఎంత బతిమాలినా ఉండక, పనిఉన్నదని చెప్పి, ఇంటికి వచ్చేశాడు.

కొన్ని రోజులు గడిచాయి. వెంకాయమ్మకు, కోడలు లేకపోవటంచేత, ఇల్లు బోసిపోయినట్టు కనబడసాగింది. కోడలు ఇంటిపని చాలా చేసేది. ఇప్పుడు వెంకాయమ్మకు విశ్రాంతి లేకుండా పోయింది. కోడలు ఉండగా తాను ఆమెమీద పెత్తనం చెయ్యటంతప్ప, పట్టుమని గట్టిగా పనిచేసినట్టు ఆమెకు గుర్తురాలేదు. అలవాటు తప్పటం మూలాన ఆమెకు ఇప్పుడు ఇంటిపని అంతా చేయాలంటే ఒళ్ళు హూనమై పోతున్నది.

ఇంతకన్న చిత్రం ఏమిటంటే, తాను రోజూ కోడలిని దేనికి తప్పు పట్టిందో, ఎందుకు ఆమెతో పోట్లాడిందో వెంకాయమ్మకు ఎంత ప్రయత్నించినా జ్ఞాపకం రాలేదు. ఆమె కోడలు కోసం బెంగపడ సాగింది.

చూసి, చూసి ఆమె ఒకరోజు కొడుకుతో, "ఒరే, కేశవా! పోయి కోడల్ని తీసుకురా! ఎన్నాళ్లుంటుంది పుట్టింట్లో? ఇదే సుఖంగా ఉన్నట్టుంది దానికి!" అన్నది, కోడల్ని దెప్పుతున్నట్టు ధ్వనించేలాగా.



కేశవుడు తల్లి మాట వినీ విననట్టు ఊరుకున్నాడు.

సుశీలకు పుట్టింటో మొదటసుఖంగానే ఉన్నది. అయితే తన పుట్టింటి వాళ్లకు క్రమంగా తనపట్ల శ్రద్ధ తగ్గటం ఆమె గమనించింది. ఆమెను తల్లి మొదట ఆదరంగానే చూసింది. కాని కూతురు అత్తవారింటికి తిరిగి వెళ్ళే సూచనలు కనబడకపోయేసరికి, ముభావంగా ఉండ సాగింది.

అంతకన్న సుశీలను మరింతగా బాధించినదేమంటే, తన తల్లి తన అన్న భార్యను అడుగడుగునా తప్పుపట్టి, సాధిస్తున్నది. చచ్చేటట్టు చాకిరి చేయిస్తున్నది; తిండికూడా సరిగా పెట్టదు! తన తల్లిలో అలాటి రాక్షసత్వం ఉన్నదని సుశీల అదివరకు ఎరగదు. తల్లి కొరంటికం పెట్టుతూంటే, తన అన్న తన భార్యను ఓదార్చటానికి బదులు తాను కూడా దండిస్తాడు. తన వదినను చూసినాక ఆడది మెట్టినింట ఎంత హీనంగా బతకటానికి వీలున్నదో సుశీల గ్రహించి, ఎప్పుడు తన భర్త వద్దకు వెళ్ళిపోదామా అని తొందరపడసాగింది.

వెనక్కు తిరిగి చూసుకుంటే, తన అత్తగారు తనపట్ల చూపిన ఆదరం సుశీలకు జ్ఞాపకం వచ్చింది. తాను ఆమెతో రోజూ ఎందుకు జగడమాడవలసి వచ్చిందో సుశీలకు జ్ఞాపకంరాలేదు. ఎప్పుడు వెళ్ళి అత్త ఒళ్లో పడదామా అన్నట్టుగా, సుశీల భర్తకోసం ఎదురు చూడటం మానేసి, తానే బయలుదేరి వచ్చేసింది. కోడల్ని చూడగానే వెంకా యమ్మ కౌగలించుకుని, "అయ్యో, ఇలా చిక్కిపోయావేమే! తల్లీ!" అన్నది. ఇప్పుడామె కళ్లకు తన కోడలు పుట్టింట అగచాట్లు పడి వచ్చినట్టు కనబడింది!

అటుతరవాత ఆ అత్తా, కోడళ్లు తల్లీ కూతుళ్ళకన్న ఎక్కువ ప్రేమగా మసులు కున్నారు





# విశ్వామిత్రుడు

గాధి అనే రాజుకు సత్యవతి అనే కూతురు ఉండేది. కొడుకులు లేరు. సత్యవతిని ఋచీకుడు అనే తపశ్శాలి పెళ్ళాడాడు. తనకూ, తనతోబాటు తన తల్లికీ కొడుకు కలగాలని సత్యవతి ఋచీకుణ్ణి కోరింది.

"నువు మేడిచెట్టు మానును కౌగలించుకో. నీ తల్లిని రావిచెట్టు మానును కౌగలించుకోమను." అని చెప్పి సత్యవతికీ, ఆమె తల్లికీ వేరు వేరుగా హవ్యాలు ఇచ్చాడు ఋచీకుడు. అయితే వారు ఒకరి హవ్యాన్ని మరొకరు తిన్నారు. ఆ కారణంగా క్షత్రియ స్వభావంతో పుట్టవలసిన గాధి కొడుకు బ్రాహ్మణ స్వభావంతో పుట్టాడు. అతనే విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడు క్షత్రియుడిలాగే పెరిగి, కృశాశ్వుడు అనే ఆయన వద్ద అస్త్రవిద్య నేర్చి, గాధి అనంతరం తాను రాజయాడు.

ఒకసారి విశ్వామిత్రుడు వేటకు వెళ్ళి, బడలికతో వసిష్ఠుడి ఆశ్రమం చేరాడు. వసిష్ఠుడు తన హోమధేనువు సహాయంతో విశ్వామిత్రుడికీ, అతని పరివారానికీ చక్కని విందు చేశాడు.

అది చూసి విశ్వామిత్రుడు వసిష్ఠుడితో, "కావాలంటే నీకు లక్ష గోవు లిస్తాను. నాకు నీ హోమధేనువును ఇయ్యి." అని అడిగాడు.

అందుకు వసిష్ఠుడు ఒప్పుకోలేదు.

విశ్వామిత్రుడు హోమధేనువును బలాత్కారంగా తీసుకుపోవటానికి యత్నించాడు. అయితే వసిష్ఠుడితపశ్శక్తి చేత ఆ ధేనువునుంచి అసంఖ్యాకంగా సైనికులు పుట్టి, విశ్వామిత్రుడి పరివారాన్ని పారదోలారు.

అది లగాయతు విశ్వామిత్రుడికి వసిష్ఠుడిపైన పగా, ఈర్ష్య కలిగాయి.

వసిష్ఠుడి శక్తికి తపస్సే మూలకారణమని గ్రహించి, విశ్వామిత్రుడు రాజ్యాన్ని వదిలేసి, తపస్సు ప్రారంభించాడు.

విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యటానికి ఇంద్రుడు మేనకను పంపాడు. విశ్వామిత్రుడు మేనక మోహంలోపడి, తపస్సుమాని, ఆమెతో సంసారం ప్రారంభించి, ఆమెకు శకుంతల అనే కుమార్తెను కూడా కన్నాడు. తరవాత ఆయన తన పొరపాటు గ్రహించి తిరిగి తపస్సు చేయనారంభించాడు. కాని ఎంత తపస్సు చేసినా విశ్వామిత్రుడికి కోపంపోలేదు.

విశ్వామిత్రుడికీ, వసిష్ఠుడికీ పడకపోవటం మూలాన ఒక వింత సంఘటన జరిగింది. సత్యవ్రతు డనే పేరు కూడా గల త్రిశంకు డనే సూర్యవంశపురాజు బొందితో స్వర్గానికి వెళ్ళాలన్న కోరిక కలిగి, అందుకు వీలు కలిగించే యజ్ఞం ఏదైనా తన చేత చేయించమని వసిష్ఠుణ్ణి అడిగాడు. అది సాధ్యమయేపనికాదని వసిష్ఠుడు చెప్పాడు. తన కోరిక తీర్చనందుకు త్రిశంకుడు వసిష్ఠుణ్ణీ, అతని కొడుకులనూ నిందించాడు. వాళ్లు ఇతన్ని చండాలుడు కమ్మని శపించారు.

తరవాత త్రిశంకుడు తనను బొందితో స్వర్గానికి పంపమని విశ్వామిత్రుణ్ణి కోరితే ఆయన ఒప్పుకున్నాడు. ఆయన ఒక యాగం చేసి, తన తపశ్శక్తినంతా ధార పోసి, త్రిశంకుణ్ణి స్వర్గానికి పంపాడు. కాని ఇంద్రుడు త్రిశంకుణ్ణి స్వర్గానికి రానీయక, తిరిగి భూమికేసి తోసేశాడు. కిందపడిపోతున్న త్రిశంకుడి కోసం మధ్య దారిలో విశ్వామిత్రుడు ఒక స్వర్గాన్ని ప్రతిసృష్టి చేశాడు. అదే త్రిశంకు స్వర్గం.

తాను కూడా వసిష్ఠుడిలాగే బ్రహ్మర్షి అనిపించుకోవాలని, విశ్వామిత్రుడు ఘోర తపస్సు చేశాడు. దాన్ని భగ్నం చేయాలని ఇంద్రుడు ఈసారి రంభను పంపాడు. ఒకసారి మేనక మూలంగా తపోభంగం పొంది ఉన్న విశ్వామిత్రుడు ఈసారి రంభకు లొంగక, ఆమెను రాయి కమ్మని శపించాడు.





# మృతసంజీవనీ విద్య

తొలికాలంలో దేవదానవులకు జరిగిన మహాదారుణ యుద్ధాలలో ఉభయ పక్షాలా అనేకమంది చచ్చేవారు. అయితే దానవులకు గురువైన శుక్రాచార్యుడికి మృతసంజీవనీ విద్య తెలియటం వల్ల, ఆయన చచ్చిన రాక్షసులను తిరిగి బతికించేవాడు. ఈ విద్య దేవతలకు రాదు.



దేవతలకు గురువైన బృహస్పతికి కచుడు అనే కొడుకు ఉండేవాడు. వాడు చాలా తెలివిగల వాడు. శుక్రాచార్యుడి వద్ద మృతసంజీవనీ విద్య నేర్చుకు రమ్మని, కచుణ్ణి దేవతలు పంపారు.



తన కొత్త శిష్యుడైన కచుడి శుశ్రూషలకు శుక్రాచార్యుడు పొంగిపోయాడు. ఆయన కూతురు దేవయాని కచుడితో గాఢస్నేహం చేసింది.



కచుడి పైన్న శుక్రుడికీ, దేవయానికీగల గాఢమైన అనురాగం చూసి దానవులు ఈర్ష్య చెంది, అతను మృతసంజీవని విద్యకోసం వచ్చినట్టు శంకించి, అతన్ని చంపటానికి ఆలోచన చేశారు.

ఒకనాడు బీడులో కచుడు తన గురువు గారి పశువులను మేపుతూండగా, దానవులు అకస్మాత్తుగా అతని పైన పడి చంపేశారు. అయితే ఈ విషయం త్వరలోనే దేవయానికి తెలియవచ్చింది.





తన ప్రియుణ్ణి తిరిగి బతికించమని దేవయాని తన తండ్రిని కోరింది. శుక్రుడు అందుకు ఒప్పుకుని, తన విద్యతో కచుణ్ణి తిరిగి బతికించాడు.



దానవులు మరొకసారి కుట్రచేశారు. ఈ
సారి వాళ్ళు కచుణ్ణి కాల్చి బూడిద చేసి,
ఆ బూడిదను మద్యంలో కలిపేశారు.



తరవాత వాళ్ళు ఆ మద్యాన్ని తమ
గురువైన శుక్రుడికి తాగటానికి ఇచ్చి,
కచుడు మళ్ళీ బతికిరాకుండా జాగ్రత్త
పడ్డారు. శుక్రుడు తెలియక ఆ మద్యాన్ని
తాగాడు.



దానవులు వెళ్ళిపోయాక, దేవయాని
పరిగెత్తుకుంటూ వచ్చి, దానవులు చేసిన
మోసం తండ్రికి చెప్పింది. తాను చావ
కుండా కచుడు బతికి బయట పడలేడని
గ్రహించాడు శుక్రుడు. ఏమంటే కచుడు
బతికినా తన పొట్టలోనే ఉంటాడు.



అందుచేత శుక్రుడు తన పొట్టలో ఉన్న కచుణ్ణి తన విద్యతో బతికించి, అతడికి మృతసంజీవనీ మంత్రం ఉపదేశించాడు. కచుడు శుక్రుడి పొట్ట చీల్చుకుని తన సహజరూపంతో బయటికి వచ్చాడు.



తన కిప్పుడు మృతసంజీవని మంత్రం వచ్చును గనుక, కచుడు దాని సహాయంతో శుక్రుణ్ణి బతికించాడు. ఈ విధంగా కచుడు తాను కోరిన విద్యను సాధించిన వాడైనాడు.



కచుడు ఇప్పుడు దేవతల వద్దకు తిరిగి పోవలసి ఉన్నది. దేవయాని అతన్ని గాఢంగా ప్రేమించి అతన్ని పెళ్ళాడదామనుకున్నది. కాని గురువు కుమార్తె చెల్లెలితో సమానం కావటంచేత వారికి వివాహం పొసగలేదు.



# అభిమన్యుడు

అభిమన్యుడు సుభద్రకూ, అర్జునుడికీ పుట్టిన కొడుకు. పాండవులు శకునితో జూదమాడి ఓడి వనవాసం వెళ్లినప్పుడు, వారి వెంట అరణ్యవాసం చేసినది ద్రౌపది ఒక్కతే. కుంతి హస్తినాపురంలోనే ఉండిపోయింది. కృష్ణ బలరాములు తమ చెల్లెలైన సుభద్రనూ, ఆమె కొడుకు అభిమన్యుణ్ణీ తమ వెంట ద్వారకకు తీసుకువెళ్ళారు.

బలరాముడికి శశిరేఖ అనే కూతురు ఉండేది. ఆమె అభిమన్యుణ్ణి ప్రేమించింది. అభిమన్యుడు కూడా ఆమెను ప్రేమించాడు. కాని బలరాముడు శశిరేఖను దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడికి ఇచ్చి చెయ్యాలనే ఉద్దేశంతో ఉన్నాడు. పెళ్ళి ప్రయత్నాలు కూడా పూర్తి అయి, పెళ్లి పీటలమీద ఉండగా, ఘటోత్కచుడు (హిడింబి అనే రాక్షసికి భీముడి వల్ల కలిగిన కొడుకు) శశిరేఖను రాక్షసమాయలు ప్రయోగించి ఎత్తుకుపోయి, అభిమన్యుడితో ఆమెకు వివాహం జరిపించాడు.

పన్నెండేళ్లు వనవాసం చేసిన అనంతరం పాండవులు మత్స్యదేశంలోని విరాటనగరంలో మారువేషాలతో ఏడాదిపాటు అజ్ఞాతవాసం చేసి, చివరకు బయటపడ్డారు. ఈ సంగతి తెలిసిన సుభద్ర అభిమన్యుడితో సహా విరాటనగరం వెళ్ళి, పాండవులను కలుసుకున్నది.

తన ఇంట బృహన్నలగా ఉంటూ, కౌరవులతో తనకు యుద్ధం వచ్చినప్పుడు తన కొడుకును ఉత్తరుణ్ణి సారథిగా పెట్టుకుని, కౌరవసేనను ఓడించినవాడు సాక్షాత్తూ అర్జునుడేనని తెలియగానే విరాటరాజు అతనితో బంధుత్వం చేయ

గోరి, తన కూతురు ఉత్తరను అతనికి ఇచ్చి పెళ్ళిచేస్తానన్నాడు.

దానికి అర్జునుడు ఉత్తరను తన కొడుకు అభిమన్యుడికి ఇచ్చి చెయ్యమన్నాడు. ఉత్తరాభిమన్యుల వివాహం విరాటనగరంలోనే మహావైభవంగా జరిగిపోయింది.

ఈ పెళ్లి జరిగిన కొద్దికాలానికే కౌరవ పాండవులకు కురుక్షేత్రంలో మహా దారుణమైన యుద్ధం ప్రారంభమయింది. అందులో అభిమన్యుడు అసమాన శౌర్య పరాక్రమాలు ప్రదర్శించి, తన ముందు ఎవరూ నిలవలేని విధంగా యుద్ధం చేస్తూ వచ్చాడు.

ఒకనాడు కౌరవ సేనను పద్మవ్యూహంలో ద్రోణుడు నిలబెట్టాడు. పద్మవ్యూహాన్ని ఛేదించటం అర్జునుడికీ, అభిమన్యుడికీ తెలుసు. కాని ఆ రోజు అర్జునుడు ఇంకోరంగంలో సంశప్తకులతో యుద్ధం చేయబోయాడు. ఆ కారణంవల్ల ద్రోణుడి అధ్వర్యంలోవున్న కౌరవుల పద్మవ్యూహాన్ని ఛేదించే బాధ్యత అభిమన్యుడి పైన పడింది.

అయితే పద్మవ్యూహం ప్రవేశించటం చాతనవునుగాని, అవసరమైతే దాని నుంచి బయటికి వచ్చే మార్గం తనకు తెలియదని అభిమన్యుడు చెప్పాడు. కాని ధర్మరాజు మొదలైనవారు, "నీ కేమీ భయంలేదు. మేమంతా నీ వెనకనే పద్మవ్యూహం ప్రవేశించి, శత్రువుల మధ్య నువు ఒంటరిగా ఉండిపోకుండా చూస్తాం," అన్నారు.

కాని ఇలా జరగలేదు. అభిమన్యుడి వెనకగా పద్మవ్యూహంలో ప్రవేశించబోతున్న ఇతర పాండవులకు సైంధవుడు అడ్డుపడ్డాడు. చివరకు అభిమన్యుడు కౌరవసేనలో ఒంటరిగా చిక్కి, ద్రోణుడూ కృపుడూ, అశ్వత్థామా, కృతవర్మా, కర్ణుడూ, దుర్యోధనుడూ మొదలైన మహావీరులు చుట్టుముట్టగా, అందరితోనూ ఒంటరిగా యుద్ధం చేస్తూ, వీర మరణం పొందాడు.





# సంఘపీడ

ఒక సవర్ణుల గ్రామానికి కొద్ది దూరంలో ఒక హరిజనవాడ ఉండేది. హరిజనుల పెద్ద కాలూ అనేవాడు. వాడు సాధువూ, సజ్జనుడూనూ. ఇక గ్రామంలోని సవర్ణులు చాలా సనాతనులు. హరిజనుడి నీడ తమమీద పడినా సహించరు. గ్రామంలో కెల్లా పెద్ద రాంభట్టు అనే శ్రోత్రియ బ్రాహ్మడు.

ఈ రాంభట్టుకు యదు అని ఒక బావమరిది—భార్యకు తమ్ముడు—ఉండేవాడు. వాడు పూర్తిగా చెడిపోయి, అన్ని దుర్వ్యసనాలకూ బానిసగా తయారయాడు. వాడు బస్తీలో ఉంటూ, అప్పుడప్పుడూ రాంభట్టు ఇంటికి వచ్చి, కొద్ది రోజులు గడిపేవాడు. ఆ రోజులలో యదు హరిజనవాడకు వెళ్ళి, అక్కడ కాపు సారా తాగేవాడు. వాడు కాలూవద్ద చేబదుళ్ళు కూడా చేసి, బాకీ తీర్చమనే సరికి, అంటరానివాడు తన వంటి సద్బ్రాహ్మడికి చేబదులిచ్చి మళ్ళీ అడుగుతాడా అని పట్టరాని ఆగ్రహం వచ్చి, కాలూ అంతు తేల్చాలని నిశ్చయించుకున్నాడు.

యదు కాలూతో, "నీ బాకీ తీర్చమన్నావు కాదూ? మా అక్క రేపు సాయంకాలం నాకు కొంత డబ్బు ఇస్తానన్నది. నాకు రెండు, మూడు రోజుల పాటు పనితో తీరదు. అందుచేత ఇటు కేసి రాను. రేపు సాయంకాలం రహస్యంగా మా అక్క ఇంటి పెరట్లో, పశువులపాక వెనకకు వచ్చావంటే, నేను వచ్చి నీకు డబ్బిస్తాను. దేవుడి తోడు!" అన్నాడు.

మర్నాడు చీకటి పడినాక కాలూ వచ్చి, పెరట్లో పశువులపాక వెనక వేచి ఉన్నట్టు తెలిసి, యదు దీపంతో వచ్చి,

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



"ఎవరు వారు? ఎవరు వారు?" అని కేకలు పెట్టాడు. ఆ కేకలకు ఇంటిల్లిపాతీ పెరట్లోకి పరిగెత్తుకుంటూ వచ్చారు.

అపాయం శంకించి కాలూ పారిపోయాడు.

కాలూ దొంగచాటుగా రాంభట్టు పెరట్లోకి ప్రవేశించాడనేసరికే గ్రామం సంచలనం పొందింది. ఆ మీదట రాంభట్టుగారి ఆవు విషప్రయోగం ద్వారా చచ్చిందని తెలిసేసరికి గ్రామం అట్టుడికిపోయింది.

గ్రామంలో మహాకాళి ఆలయం ఉన్నది. దాని అర్చకుడు రుద్రదేవుడు ప్రపంచం చూసిన విశాల హృదయుడు. అతని ఉదార భావాలు గ్రామ పెద్దలకు నచ్చేవి కావు. కాని ఆలయానికి యజమాని అయిన జమీందారుకు అతనంటే చాలా అభిమానం కావటం చేత గ్రామ పెద్దలు ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయారు.

తన మీద కుట్ర సాగిందని తెలియగానే కాలూ అడవిలోకి పారిపోయి దాక్కున్నాడు. రాంభట్టు ఆవును చంపినది కాలూయేనని యదు ఆరోపణ చేశాడు. దానిపై గ్రామానికి చెందిన యువకులు కాలూపై పగ తీర్చుకోవటానికి హరిజనవాడకు వెళ్ళారు. రుద్రదేవుడు తమ వెంట ఉండి నిగ్రహించకపోతే, ఆ యువకులు కాలూ మీది కక్ష ఇతరుల మీద చూపేవాళ్ళే. రుద్రదేవుడు కాలూను బాగా ఎరుగును. కాలూ అలాటి పని చేశాడంటే అతను నమ్మలేదు.

కాలూ అర్ధరాత్రివేళ రుద్రదేవుడింటికి వచ్చి, తనను రక్షించమనీ, అంతా పెద్ద కుట్ర అనీ చెప్పి, జరిగినది పూర్తిగా వివరించాడు. అంతా విన్నమీదట అంతకూ మూలకారణం యదు అని రుద్రదేవుడికి స్పష్టంగా తెలిసిపోయింది. వాణ్ణి ఎలా బయట పెట్టటమా అని అతను తీవ్రంగా ఆలోచించి, చిన్న ఇంద్రజాలం ప్రయోగించ నిశ్చయించాడు.

కంటే గ్రామస్థులలో చాలామందికి కాలూ గోహత్య చెయ్యలేదన్న నమ్మకం కుదిరి పోయింది.

అది యదు చేసిన పనే అయి ఉంటుందని గ్రామస్థులు నమ్మటానికి ఎంతోకాలం పట్టలేదు. మర్నాడు అతని కోసం పోలీసులు వచ్చారు. అతను బస్తీలో చేసిన అనేక నేరాలు బయటికి వచ్చాయి. అవి రుజువు కాగానే పోలీసులు ఆచూకీపట్టి, అతన్ని పట్టుకుపోయారు.

ఇదంతా జరిగినప్పుడు జమీందారు తీర్థయాత్రలకు పోయి ఉన్నాడు. ఆయన తిరిగి వచ్చి సంగతి అంతా విని, తాను హరిజనుల కోసం ఇంకా మంచి ఏర్పాట్లు చేయనందుకు పశ్చాత్తాపపడి, గ్రామ సౌకర్యాలన్నీ వారికి కూడా అందు బాటులో ఉండేటట్టూ, వారికి కూడా ఆలయంలో ప్రవేశం ఉండేటట్టూ ఏర్పాటు చేశాడు.

తరవాత ఆయన రుద్రదేవుడితో, "కాలూను రక్షించి ఘనకార్యమే చేశావు గాని, అందులోకి మహాకాళిని ఎలా ఇరికించగలిగావు?" అని నవ్వుతూ అడిగాడు.

"అందుకు చిన్న మోసం చేశాను, చెప్పొద్దూ! నేను నల్లటి చొక్కా తొడుక్కున్నాను. పుల్లకు సన్నని నల్లదారం, తగిన నిడుపు గలది పై భాగాన అతికించి, దాని రెండో చివర నా చొక్కా గుండీకి ముడివేశాను. ఆ దారం ఎవరికీ కనబడే అవకాశం లేదు. నీలం రాయి ఉన్న ఉంగరాన్ని పుల్ల పైభాగం నుంచి వేసి నప్పుడు ఆ పుల్లను చొక్కాకు దగ్గిరిగా పట్టుకున్నాను. ఉంగరం పుల్ల వెంబడి దిగి, నా చేతిమీద పడింది. ఎర్ర రాయి ఉంగరం వేసినప్పుడు పుల్లను కొంచెం ఎడంగా పట్టుకున్నాను. ఉంగరం పుల్ల దిగువకు రాకుండా దారం అడ్డింది. తరవాత నేను పుల్లను కొద్దిగా ముందుకూ, వెనక్కూ ఆడిస్తే, ఉంగరం పైకీ, కిందికీ ఆడింది. అంతకన్న విశేషం ఏమీలేదు." అన్నాడు రుద్రదేవుడు.





# కళాపిపాస

చంద్రగిరిని పాలించిన విజయపాలుడు గొప్ప కళాపిపాసి. అతను తన ఆస్థానంలో అనేకమంది కవులనూ, శిల్పులనూ, చిత్రకారులనూ, గాయకులనూ పోషించటమేగాక, ఇతర దేశాలలో ఉన్న ఉత్తమ కళాకారులను ప్రోత్సహించే ఉద్దేశంతో ఏటా కళా పోటీలు ఏర్పాటు చేసేవాడు. ఈ పోటీలలో సాధారణంగా చంద్రగిరి ఆస్థాన కళాకారులే నెగ్గేవారు. దారి తప్పి ఇతర దేశాలవాళ్ళు నెగ్గటం జరిగితే వారిని విజయ పాలుడు తన కొలువులోకి తెప్పించుకునేవాడు.

ఇతర కళల మాట ఏమైనప్పటికీ శిల్పంలో మటుకు చంద్రగిరిని అనేక సంవత్సరాలుగా ఇంకే దేశమూ మించ లేదు. అందుకు కారణం సుచిత్రుడు అనే అద్భుత శిల్పి. అతన్ని శిల్పకళలో సమీపించగలవాడు నూరు యోజనాల దూరంలో ఎవడూ లేడని చెప్పుకునేవారు. విజయపాలుడికి అతనంటే అమితమైన ఆదరాభిమానాలు. సుచిత్రుడు శిల్ప కళలో చంద్రగిరి పేరు ఉన్నతంగా ఉంచటమేగాక, అతను మరే రాజుకూ అమ్ముడుపోవ నిరాకరించి, లువిజయపాడి ఆదరానికి మరింత పాత్రుడయాడు.

అలాటి సుచిత్రుడు ఆకస్మికంగా చని పోయాడు. విజయపాలుడు సుచిత్రుడి కొడుకు వైశాఖుణ్ణి ఆస్థానశిల్పిగా నియ మించాడు. వైశాఖుడు తండ్రికి చాలా ఏళ్ళుగా సహాయపడ్డాడు. రాయి శిల్పంగా మారే దశలన్నీ అతనికి తెలుసు, కాని అతను అందులో ఒకటి రెండు మెట్లు మాత్రమే ఎక్కగలిగాడు. సుచిత్రుడు అతన్ని తనంత శిల్పిని చెయ్యాలని విశ్వ ప్రయత్నాలు చేశాడు గాని, ఆ ప్రయ త్నాలు ఫలించలేదు.

బూర్లె నాగేశ్వరరావు



అయినా ఆ యేడు చంద్రగిరిలో జరిగిన శిల్ప పోటీలో వైశాఖుడి శిల్పానికి అగ్రస్థానం లభించింది. పోటీ ఫలితాలు నిర్ణయించిన దేశదేశాల శిల్ప నిపుణులు, వైశాఖుడు తండ్రికి ఏ మాత్రమూ తీసి పోడని ఏకగ్రీవంగా ఆమోదించారు.

అది మొదలు వైశాఖుడు తయారు చేసిన శిల్పాలన్నిటా అత్యుత్తమ కళా ప్రమాణాలు కనిపించాయి. కాని, అసలు రహస్యం ఏమిటంటే, ఆ శిల్పాలు అతను చెక్కినవి కావు. వాటిని చెక్కినవాడు శ్రీముఖుడు అనే కుర్రవాడు.

శ్రీముఖుడు సుచిత్రుడి వద్ద శిష్యుడుగా చేరి, ఒకటి, రెండు ఏళ్ళలో సుచిత్రుడితో సమానమైన సామర్థ్యం సంపాదించాడు. శిల్పకళ అతనికి పూర్వజన్మ సంచితమా అనిపించేది. సుచిత్రుడు ఒకేసారి అనేక శిల్పాలు చేయవలసి వచ్చినప్పుడు వాటిలో కొన్నిటిని శ్రీముఖుడు పూర్తి చేశాడు. ఎవరికీ తేడా తెలియలేదు. సుచిత్రుడు చనిపోతూ శ్రీముఖుడితో, "నాయనా, నీ కాళ్ళమీద నువు నిలబడి మహా శిల్పిగా గుర్తింపు పొందేదాకా నా కొడుకుకు సహాయపడు," అన్నాడు.

గురువుగారు ఆ మాట అన్నందుకు శ్రీముఖుడు తాను వైశాఖుడి శిష్యుడినని చెప్పుకుంటూ, అతను తయారు చేయవలసిన శిల్పాలన్నిటినీ తానే తయారు చేస్తూ వచ్చాడు. అతనికి పేరు ప్రఖ్యాతులను గురించి కొంచెంకూడాధ్యాసలేదు. మంచి శిల్పం తయారు చేసినతృప్తి అతనికి మరే విధంగానూ కలిగేదికాదు.

విజయపాలుడికి మల్లిక అనే కుమార్తె ఉన్నది. ఆమె అపూర్వ సౌందర్యవతి. ఆమెకు పెళ్లాడే వయసు సమీపిస్తున్నది. అసాధారణ సౌందర్యం గల తన కుమార్తెకు అపాయం కలగవచ్చునని, విజయపాలుడు ఆమెను రాజభవనం దాటి బయటికి పోనియ్యలేదు. ఆమె ఎంత అందగత్తె అయినదీ బయటి ప్రపంచానికి గాలి కబురుగా మాత్రమే తెలును.



ఉన్నట్టుండి విజయపాలుడికి ఒక ఆలోచన కలిగింది. ఇవాళో, రేపో మల్లిక పెళ్లాడి, భర్త వద్దకు వెళ్లిపోతుంది. అందరిలాగే ఆమెకు కూడా వార్ధక్యం వచ్చేస్తుంది. ఇవాళ ఆమెకు గల అద్భుత సౌందర్యం నిజానికి అశాశ్వతం. దాన్ని శాశ్వతం చెయ్యాలంటే ఒకే ఒక మార్గం-ఆమె శిల్పాన్ని తయారు చేయటం. అందుకు ఆస్థానశిల్పి వైశాఖుడున్నాడు!

విజయపాలుడికి ఇంకొక ఆలోచన కూడా ఉన్నది. అదేమంటే, మల్లికను వివాహమాడతామని వచ్చే రాకుమారు లందరి ఎదటా మల్లికను ప్రదర్శించ కుండా ఆమె ప్రతిమను ప్రదర్శించవచ్చు. ఆమెను కళ్ళారా చూసినవారికి చిత్త విభ్రమం కలుగుతుందని విజయపాలుడి అనుమానం.

విజయపాలుడు వృద్ధుడైన ఆస్థాన చిత్రకారుడి చేత మల్లిక చిత్తరువులు రెండు, మూడు తయారు చేయించి, వాటి సహాయంతో వైశాఖుణ్ణి రాజభవనం లోని కళామందిరంలో మల్లిక విగ్రహాన్ని తయారు చేయమన్నాడు. శిల్పం తయా రయేదాకా శిల్పి తప్ప మరెవరూ అందు లోకి వెళ్ళకుండా కట్టుదిట్టం చేశాడు.

శిల్పానికి తగిన పాలరాతి శిలను ఎన్నికచేసి, దాన్ని ఉంచవలసిన చోట ఉంచారు. వైశాఖుడు కళామందిరంలోకి వచ్చాడు. కాని శిల్పాన్ని తయారు చేయ వలసినవాడు శ్రీముఖుడే. ఆ శ్రీముఖుడు వైశాఖుడి శిష్య సహకారిగా ఉలులూ, సుత్తెలూలాటివి పట్టుకుని తాను కూడా వచ్చాడు.

ప్రతిమ తయారు కాసాగింది. తన తండ్రి తన ప్రతిమ తయారు చేయిస్తు న్నట్టు మల్లికకు చూచాయగా తెలిసింది. అది ఎంత రహస్యంగా జరుగుతున్నదీ ఆమె ఎరగదు. ఒకరోజు ఆమె ఆసక్తి కొద్దీ ప్రతిమను చూడటానికి కళా మందిరం కేసి వెళ్లింది. శిల ముందు ఉలి, సుత్తి చేతబట్టి శ్రీముఖుడు నిలబడి,



పక్కనే శిలకు ఆనించి ఉన్న మల్లిక చిత్తరువును చూస్తున్నాడు. వైశాఖుడు దూరంగా కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నాడు.

మల్లిక రాకను ఇద్దరూ గమనించలేదు.

మల్లిక చిత్తరువును చూస్తున్న శ్రీముఖుడు, ''గురువర్యా, ఈ అబద్ధపు శిల్పాన్ని రాజుగారు ఎందుకు చెక్కిస్తున్నట్టు? ఎవరైనా ఇంత అందంగా ఉంటారా? ఇంతకన్న అందమైన స్త్రీని ఊహించి శిల్పం చెయ్యమంటే మరింత సులువుగా ఉండేది గదా!'' అన్నాడు.

శిల్పానికి ఇంకా రూపం సరిగా రాలేదు. దాన్ని చెక్కుతున్నట్టుగా కనిపించే శ్రీముఖుడు అనుభవం చాలని అర్భకుడిలాగా కనిపించాడు.

''మొదలు నీకు ఉలి పట్టటం చేతనవునా?'' అన్నదామె.

శ్రీముఖుడు ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూసి, మల్లిక అందానికి మత్తెక్కినట్టు అయిపోయి, ''అద్భుతం! ఏమి సౌందర్యం! ఈ సౌందర్యానికి శిల న్యాయం చేకూర్చగలదేమోగాని, చిత్రకారుడి కుంచె ఏం న్యాయం చెయ్యగలదు? అమ్మా, నువు నా ఎదట అలాగే నిలబడరాదా? నీ రూపు శిలలోకి దించుతాను!'' అన్నాడు.

మల్లికకు ఆగ్రహంతో మాట రాలేదు. ఆమె తండ్రి దగ్గిరికి వెళ్ళి, "నా ప్రతిమను ఎవడో అర్భకుడిచేత తయారు చేయిస్తున్నారా? వాడు నన్ను ఎగాదిగా చూసి, ఏమి అందం అంటూ నోటికి వచ్చినట్టు పేలాడు. వాడు విగ్రహం చెక్కటానికి నేను ఎదురుగా నిలబడాలట!'' అని ఫిర్యాదు చేసింది.

విజయపాలుడికి తీరని అవమానం జరిగిందనిపించింది. వెంటనే ఆయన జరిగిన సంగతి విచారించి, మల్లికతో మాట్లాడినవాడు తన ఆస్థానశిల్పి శిష్యుడనీ, ప్రపంచజ్ఞానం తెలిసే ఈడువాడు కూడా కాడనీ తెలుసుకుని, వాణ్ణి దేశ

బహిష్కరణ శిక్షతో వదిలేశాడు. వాడి సహాయం లేకుండా తాను మల్లిక ప్రతిమను పూర్తి చెయ్యలేనని వైశాఖుడు ఎంత బతిమాలినా లాభంలేకపోయింది.

శ్రీముఖుడు శిల్పాన్ని ఎక్కడ వదిలాడో అక్కడే ఉండిపోయింది. చాలా రోజులు చూసి విజయపాలుడు వైశాఖుణ్ణి పిలిచి కారణం అడిగితే, "మహారాజా, నేను అసమర్థుణ్ణి! శిల్పం చెయ్యవలసిన వాణ్ణి పంపేశారు! నేను తయారు చేసినట్టు చెప్పుకున్న గొప్ప శిల్పాలన్నీ వాడివే!" అని నిజం చెప్పాడు.

వైశాఖుడు ఇప్పుడు చెప్పేది అబద్ధమో, పూర్వం శిల్పిగా నటించినదే అబద్ధమో నిర్ణయించలేక, విజయపాలుడు అతన్ని చెరసాలలో పెట్టించాడు.

సంవత్సరం తిరిగి, మళ్ళీ కళా పోటీలు జరిగాయి. ఈ సారి ఆస్థానశిల్పి అందులో పాల్గొనలేదు. పొరుగుదేశం నుంచి ఎవరో పంపిన శిల్పానికి నిర్ణేతలు ఏకగ్రీవంగా మొదటి బహుమానం ఇచ్చారు. అదొక స్త్రీ ప్రతిమ. అది మల్లిక మూర్తి అని రాజూ, మరి కొద్దిమందీ మాత్రమే గుర్తించారు.

దాన్ని చూసి విజయపాలుడు నిర్ఘాంత పోయాడు. తన ఆస్థానశిల్పి తయారు చేయలేని ప్రతిమను ఎవరో పొరుగుదేశం వాడు ప్రాణం ఉట్టిపడేలాగా తయారు చేశాడు! అలాటివాడు తన ఆస్థానశిల్పిగా ఉండి తీరాలి. వైశాఖుడు కారాగృహంలో ఉన్నది మొదలు ఆ పదవి ఖాళీగా ఉన్నది.

ఆహ్వానం అందగానే మహాశిల్పి వచ్చాడు. వాడు శ్రీముఖుడే! వాడు మల్లికను ఒక్కసారే చూశాడు. కాని ఆమె శరీరంలోని ప్రతి అణువూ ప్రతిమలో కనపడేలాగా చెయ్యగలిగాడు.

విజయపాలుడు శ్రీముఖుడికి క్షమాపణ చెప్పుకుని, అతన్ని తన ఆస్థానశిల్పిగా నియమించాడు. వైశాఖుణ్ణి చెరనుంచి విముక్తి చేసి, సన్మానించే షరతుమీద శ్రీముఖుడు ఆస్థానశిల్పి కావటానికి ఒప్పుకున్నాడు.





# మొహమాటం జ్యోతిష్కుడు

కనకయ్య కూతురు కమల కురూపి. ఆమెకు పెళ్ళీడు వచ్చింది. కనకయ్యకు ఆమె పెళ్లి గురించి బెంగ పట్టుకున్నది. ఎంత ప్రయత్నించినా ఆ పిల్లకు సంబంధాలు దొరకడంలేదు. అతని కలవరం చూసి కనకయ్య మిత్రుడు రమణయ్య, "ఎందుకయ్యా కంగారు? ఘటన ఉండాలిగాని. నీ కూతురి పెళ్లి ఎంత సేపు? దేనికైనా సమయం రావాలి. ఆ సమయం వచ్చేసరికి ఆపాలన్నా నువు పెళ్లి ఆపలేవు," అన్నాడు.

"ఆ సమయం ఎప్పుడు వస్తుందంటావు? దానికోసమే గదా ఇంతకాలమూ ఎదురు చూస్తున్నాను?" అని కనకయ్య అడిగాడు.

"అది నేనెలా చెప్పగలను? ఎవరైనా మంచి జ్యోతిష్కుణ్ణి అడగాలి," అన్నాడు రమణయ్య.

"బాబ్బాబు, నీకు తెలిసిన జ్యోతిష్కుడుంటే చెబుదూ. అమ్మాయి జాతకం చూపిస్తాను," అన్నాడు కనకయ్య.

కనకయ్యకు పనికివచ్చే జ్యోతిష్కుడు రమణయ్య బంధువుల్లోనే ఉన్నాడు. అతనొక కుర్రవాడు. పేరు మురళి. అతనికి జ్యోతిషం నేర్చుకోవాలని చాలా సరదా. ఎన్నో జ్యోతిష గ్రంథాలు చదివి, తన జ్యోతిష జ్ఞానం పరీక్షించుకోవాలని ఉబలాటపడుతున్నాడు.

ఆ కుర్రవాడు ఒకసారి రమణయ్య జాతకం అడిగి తీసుకుని, "సరిగ్గా రెండు మాసాలలో నీకు ధనలాభం ఉంది," అన్నాడు.

అప్పట్లో డబ్బు ఇబ్బందుల్లో ఉండిన రమణయ్య, "సరిగా చూసి చెప్పు. నీకు నిజంగా జోస్యం వచ్చా?" అని అడిగాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

"నా జోస్యం తప్పదు!" అన్నాడు మురళి. అతను అంతటితో పోనివ్వక, రోజూ రామణయ్యను కలుసుకుని, అతనికి ధనలాభం కలిగినదీ, లేనిదీ విచారించి వస్తూండేవాడు.

ఇలా రెండు నెలలూ గడిచాయిగాని, రమణయ్యకు ధనలాభం కలగలేదు. తన దగ్గిరికి వచ్చిన మురళితో రమణయ్య, "ఏం జోస్యంరా నీదీ? ఒక్క దమ్మిడీ కూడా లాభం రాలేదు," అన్నాడు.

"అలా గనకు, పెదనాన్నా. ఇవేళే గదా రెండు నెలల గడువు పూర్తి అవుతున్నది. నేను రోజులు లెక్కపెడుతూనే ఉన్నాను. అరునూరయేదిగాక, నా జోస్యాన్ని తప్పు కానియ్యను. ఇవాళ నేనే నీకు వంద రూపాయలిస్తున్నాను," అన్నాడు మురళి.

రమణయ్య నిర్మొహమాటంగా మురళి ఇచ్చిన డబ్బు తీసుకుని, "జ్యోతిష్కుడంటే నీలా ఉండాలిరా! పాపం, ఆ కనకయ్య జ్యోతిష్కుడి కోసం వెతుకుతున్నాడు. నువు వెళ్ళి కనపడకూడదూ?" అన్నాడు.

తన జ్యోతిషజ్ఞానం ప్రదర్శించటానికి మంచి అవకాశం మరొకటి వచ్చిందిగదా అని, మురళి ఉత్సాహంగా కనకయ్య ఇంటికి వెళ్ళాడు. కనకయ్య మురళికి తన కూతురి జాతకం చూపించి, "ఈ జాతకురాలికి పెళ్ళి ఎప్పుడవుతుందో చెప్పు, బాబూ," అన్నాడు.





# దేవీ భాగవతం

**6. వ్యాసుడి జననం**

మత్స్యగంధి బెస్తవాడి ఇంట పెరిగి పెద్దదై, చాలా ఆకర్షవంతంగా తయారయింది.

ఒకనాడు పరాశరుడనే ముని యమున వద్దకు వచ్చి, నది దాటించమని బెస్తవాణ్ణి కేక వేశాడు. అతను ఆ సమయానికి అన్నం తింటూ, మునిని నది దాటించమని తన కూతుర్ని పంపాడు. ఆమె పడవలోకి పరాశరుణ్ణి ఎక్కించుకుని నదిని దాట సాగింది.

పడవలో తనతో ఉన్న మత్స్యగంధిని చూసి పరాశరుడికి మోహం పుట్టుకొచ్చి, మెల్లిగా ఆమె చేతిని తన చేత్తో తాకాడు. మత్స్యగంధి తన చెయ్యి తీసేసుకుంటూ, నవ్వి, "మీ వంటి వారు నా వంటిదాన్ని తాకవచ్చునా?'' అన్నది. పరాశరుడు వసిష్ఠుడి మనవడు; తాను బెస్తవాడి కూతురు. తన వద్ద చేపల కంపు. అలాటి వాడు తనను కామిస్తే తోటి ఋషులందరూ నవ్వరా?

ఇలా మత్స్యగంధి ఎన్నో విధాలుగా చెబుతున్నప్పటికీ పరాశరుడు విననట్టు నటిస్తూ, ఆమె చేతిని మళ్ళీ పట్టుకున్నాడు. అతను మోహావేశంలో ఉండి తన మాట వినిపించుకోడనీ, అలాటివారు నీతీ, జాతీ కూడా పాటించరనీ, అతన్ని నిగ్రహించటం సాధ్యంకాదనీ గ్రహించి మత్స్యగంధి, పరాశరుణ్ణి చాలా కోరికలు కోరింది: తన కన్యాత్వం చెడకూడదనీ, తన శరీర దుర్గంధం పోవాలనీ, తాను పరాశరుడితో



కూడి ఉండగా ఎవరూ చూడరాదనీ, తనకు కలిగే కొడుకు పరాశరుడికి తీసిపోనివాడుగా ఉండాలనీ, ఆమె నియమాలు పెట్టింది. పరాశరుడు ఆమె కోరికలన్నీ తీర్చాడు. ఆమె శరీరం సువాసనలు వెదజల్లేటట్టు చేశాడు. తమ చుట్టూ దట్టమైన మంచు కల్పించాడు. ఆమెకు గర్భోత్పత్తి కలిగించి తన దారిన తాను వెళ్ళిపోయాడు. ఆమెకు సద్యోగర్భం కలిగి, వెంటనే ఒక కుమారుడు పుట్టి, "అమ్మా, నేను పోయి తపస్సు చేసుకుంటాను. నువు ఎప్పుడు తలచుకుంటే అప్పుడు యిక్కడికి వస్తాను." అని వెళ్ళిపోయాడు.

అతనే వ్యాసుడు. వేదాలను విభజించి వ్యాసుడయాడు. అసలు పేరు ద్వైపాయనుడు. అతను పద్దెనిమిది పురాణాలూ రాసి, తన శిష్యులకు చెప్పాడు. ఆ శిష్యులలో సుమంతుడూ, జైమినీ, పైలుడూ, వైశంపాయనుడూ, అసితుడూ, దేవలుడూ మొదలైనవారున్నారు. వీరితోబాటు శుకుడు కూడా ఉన్నాడు.

తరవాత బెస్తవాడి కూతురు సత్యవతి అనే పేరుతో తన తండ్రి ఇంట కొంతకాలం ఉన్న అనంతరం శంతనుడు అనే రాజు ఆమెను పెళ్ళాడి, ఆమె వల్ల బిడ్డలను కన్నాడు.

సూతుడిలా అనగానే మునులు, "మహానుభావా, సత్యవతీ, వ్యాసుడూ పుట్టిన విధం చెప్పి మాకు ఆనందం కలిగించావు. కాని శంతనుడు పురువంశంలో పుట్టిన గొప్ప రాజుకదా, తక్కువ కులానికి చెందినదాన్ని ఎలా పెళ్ళాడాడు? అతనికి అంతకు ముందు భార్య లేదా? భీష్ముడు అతని కొడుకే గదా! ఈ వివరాలన్నీ మాకు చెప్పు." అన్నారు.

దానికి సూతుడు ఇలా చెప్పసాగాడు:

### శంతనుడి కథ

మహాభిషుడనే గొప్పరాజు ఉండేవాడు. అతను ఆనాటి రాజు లందరిలోనూ మేటి. అతను వెయ్యి అశ్వమేధయాగాలు చేసి,

ఇంద్రుణ్ణి మెప్పించి, స్వర్గానికి వెళ్ళి, అక్కడ మరో ఇంద్రుడిలాగా ఉంటూ, ఒకనాడు ఇతర దేవతలతోబాటు బ్రహ్మను చూడటానికి సత్యలోకానికి వెళ్ళాడు. అదే సమయంలో గంగానది కూడా బ్రహ్మను చూడవచ్చి, ఒక పక్కగా నిలబడింది.

అప్పుడు గట్టిగా గాలివీచి, గంగ కట్టుకున్న బట్ట కొంచెం తొలగింది. మిగిలిన దేవతలు మర్యాదగా తమ కళ్లు తిప్పుకున్నారు. కాని మహాభిషుడు మాత్రం సభ్యత ఏ మాత్రమూ పాటించకుండా, గంగ శరీర సౌందర్యంతో మోహావేశుడై, ఆమె కేసి చూస్తూ ఉండిపోయాడు. గంగ కూడా అది గమనించి, మహాభిషుణ్ణి తానుకూడా మోహంతో చూసింది.

ఈ ఇద్దరిమధ్యా పరస్పరాకర్షణ గమనించి బ్రహ్మ కోపించి, "పెద్దల మధ్య అవివేకంగా ప్రవర్తించినందుకు మీరిద్దరూ మానవులుగా పుట్టండి," అని వారిని శపించాడు. శాపం పొందిన విచారంతో వారిద్దరూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

తరవాత మహాభిషుడు ఎవరికొడుకై పుట్టుదామా అని ఆలోచించి, పురు వంశానికి చెందిన ప్రతీపుడనే రాజుకు కొడుకుగా పుట్ట నిశ్చయించాడు.

ఇది ఇలా ఉండగా ఒకసారి వసువులు ఎనిమిది మందీ తమ భార్యలతో సహా



వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళారు. వారిలో ప్రభాసుడు అనే వసువు భార్య, నందిని అనే వసిష్ఠుడి గోవును చూసి, దాన్ని గురించి అడిగింది.

"ఇది వసిష్ఠుడిగోవు. దీనిపేరు నందిని. దీని పాలు కొంచెంతాగితే ముసలితనమూ, చావూ రావంటారు," అన్నాడు ప్రభాసుడు తన భార్యతో.

"అలాగైతే, ఈ గోవును నా స్నేహితురాలైన ఉశీనరరాజు కూతురు జితవతికి ఇస్తే ఆమె చక్కగా ముసలితనమూ, చావూలేకుండా ఉంటుంది. ఈ గోవును నా కోసం తీసుకురా!" అన్నది ప్రభాసుడి భార్య.



భార్యల వ్యామోహంలో పడిన వాడికి వివేకం ఉండదు గదా! ప్రభానుడు మిగిలిన వసువుల సహాయంతో నందినీ ధేనువును దొంగిలించి తీసుకుపోయాడు.

తరవాత వసిష్ఠుడు తన ఆవు కోసం ఎంతో కష్టపడి వెతికి, చివరకు వసువులు దాన్ని దొంగిలించారని తెలిసి, వారిని మనుషులై పుట్టమని శపించాడు. ఈ సంగతి తెలియగానే వసువులు వసిష్ఠుడి వద్దకు వెళ్లి, శాపవిమోచనం అనుగ్రహించమని వేడుకున్నారు.

వసిష్ఠుడు వాళ్ళమీద కరుణగలిగి, ''భార్యకోసం నా ధేనువును హరించిన పాపాత్ముడు ప్రభానుడు మనిషిగా దీర్ఘ కాలం బతుకుతూ, బ్రహ్మచారిగా ఉండిపోతాడు. మిగిలిన ఏడుగురూ పుట్టుతూనే తిరిగి మీ రూపాలు పొందుతారు,'' అన్నాడు.

తరవాత వసువులు వసిష్ఠుడి వద్ద నుంచి తిరిగి వస్తూండగా భూలోకానికి పోతున్న గంగ ఎదురయింది. ఒకరి శాపాలు ఒకరికి చెప్పుకున్నాక వసువులు గంగతో, ''తల్లీ, మేం నీ కడుపున పుట్టుతాం. నువు మా యందు అనుగ్రహం ఉంచి, శంతనుడికి భార్యవు కా. అంతేకాదు, పుట్టగానే మమ్మల్ని చంపెయ్యి. అలా చేస్తే మా శాపం త్వరగా తీరిపోతుంది,'' అన్నారు.

గంగ సరేనన్నది. తరవాత ఎవరి దారిన వారు వెళ్లిపోయారు.

తరవాత ఒకనాడు ప్రతీపుడు గంగా తీరాన సూర్యుడికి అర్ఘ్యం ఇస్తూండగా, ఒక నవయువ్వని జంకూ, గొంకూ లేకుండా ఆ రాజును సమీపించి, స్వతంత్రంగా అతని కుడి తొడ మీద కూర్చున్నది. ఆమెను చూసి ప్రతీపుడు, ''అమ్మాయీ, ఎవరు నువు? ఎందుకిలా వచ్చి నా తొడ మీద కూర్చున్నావు?'' అని అడిగాడు.

ఆమె చిరునవ్వు నవ్వి, చిత్రంగా చూస్తూ, ''నేను ఎవతెనైతే నేం? నువు మన్మధుడిలాగున్నావు. నా యౌవనం నీకు

చేసేపని ఎలాటిదైనా సరే, నువు దానికి అభ్యంతరం చెప్ప కూడదు! అదేగాక నాకు అప్రియమైన విధంగా ఎన్నడూ మాట్లాడరాదు. ఇందుకు సమ్మతమైతే నాతో నువు సమస్త సుఖాలూ అనుభవించ వచ్చు. ఈ నియామానికి ఎప్పుడు భంగం కలిగితే అప్పుడే నిన్ను విడిచి వెళ్ళి పోతాను. నన్ను తప్పుపట్టి లాభం లేదు, ముందే చెప్పేస్తున్నాను,'' అన్నది. ఇలా అనేటప్పుడు ఆమె వసువులు తనను కోరిన కోరిక గుర్తుంచుకున్నది.



ఆమె పెట్టిన నియమాలకు శంతనుడు ఒప్పుకున్నాడు. గంగ కూడా చాలా కాలంగా అతని మీద మనస్సు ఉంచినది కావటంచేత, అతని వెంట అతని ఇంటికి వెళ్లి, అతనితో సుఖాలలో మునిగి తేల సాగింది.

శంతనుడికి భార్య అయి గంగ ఏడాది కల్లా ఒక కొడుకును కని, వెంటనే వాణ్ణి నీటిలో పారేసింది. ఇలా ఏడాదికొక వసువు చొప్పున ఏడుగురు వసువులు ఆమె గర్భాన పుట్టి, వెంటనే నీటిలోపడి, శాపవిముక్తులయారు.

ఇది చూసి శంతనుడు చాలా బాధ పడ్డాడు. గంగ ఏడుగురు చక్కని కొడుకులను కని, దయాదాక్షిణ్యాలు లేకుండా చంపేసింది. ఇక ఆమె ద్వారా తన వంశం ఎలా వృద్ధి పొందుతుంది? ఇదేమిటని తాను అన్నాడో, ఆమె తక్షణం తనను విడిచిపెట్టి పోతుంది! నియమం లేని మనిషిని కట్టుకుంటే ఇలా కాక ఏమవుతుంది?

గంగ ఎనిమిదోసారి గర్భవతిగా ఉన్నది. ఏమైనా సరే, ఈసారి పుట్టే బిడ్డను దక్కించుకుని, వంశాంకురంగా నిలపాలని శంతనుడు అనుకున్నాడు. గంగ ఎనిమిదవ బిడ్డను ప్రసవించింది. ఇతనే శాపం తిన్న ప్రభాసుడు. ఈ బిడ్డను కూడా గంగ నీటిలో పడవేయబోయింది.

కాని శంతనుడు ఆమెతో ఎంతో వినయంగా, ''నేను నీకు లోబడి ఉంటు

న్నాను. నా మాట అలక్ష్యం చెయ్యకు. కన్నకొడుకును చంపుకోవటం ఏం న్యాయం? జాలి కూడా లేదా? గొడ్రాలి లాగా, నీకు ఏ ద్రోహమూ చెయ్యని కొడుకును చేతులారా చంపుకుంటావా? నీకు మాట ఇచ్చిన దోషానికి వంశనాశనం ఎలా చేసుకోను? ఏడుగురిని చంపేశావు. వీడినన్నా బతకనియ్యి. ఇంతలో నీకు వ్రతభంగం కాదులే!'' అంటూ, ఎన్నో విధాల చెప్పుకున్నాడు.

కాని గంగ అతని మాటలు వినిపించుకోకుండా తన బిడ్డను చంపటానికి బయలుదేరింది. శంతనుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను ఆమెకు అడ్డం వెళ్ళి, ''ఓసి దుర్మార్గురాలా! నీకు నా మాట లక్ష్యం లేదు! నరకభయం మొదలే లేదు! కన్నకొడుకులను గంగలో కలుపుతావా? ఏ దుష్టుడు నిన్ను కన్నాడు? నువు ఉంటే ఉండు, పోతేపో! నిన్ను మాత్రం ఈ బిడ్డను చంపనియ్యను.'' అన్నాడు.

అప్పుడు గంగ అతనితో, ''ఇచ్చిన మాట తప్పావు. ఇక నీకూ, నాకూ చెల్లు! నువు ఉత్తముడివి. నిన్ను విడిచిపోవటం ధర్మం కాదు. అయితే అందుకు కారణం నీకు చెప్పాలి. నేను మామూలు స్త్రీనికాను, గంగను. ఒక దేవకార్యం నిమిత్తం నిన్ను వరించాను. మునిశాపంవల్ల వసువులు మానవజన్మ ఎత్తవలసిరాగా, నీ ద్వారా నేను వారికి తల్లిని కావటానికి ఒప్పుకున్నాను. వాళ్ళు మానవులుగా ఎంతో కాలం ఉండటానికి ఇష్టపడక, పుట్టిన వెంటనే శాపవిముక్తి కలిగించమని నన్ను వేడుకున్న కారణంగా, నేను పాపానికి ఒడిగట్టి, వారిని పుట్టగానే నీటిలో పారేశాను. ఇప్పుడు పుట్టినవాడు ఎనిమిదో వసువు. వీడు దీర్ఘకాలం బతికి, నీకు కీర్తి తెస్తాడు. వీడు యుక్త వయసు వచ్చేదాకా నా దగ్గరనే ఉంటాడు. తరవాత నేను వీణ్ణి నీకు అప్పగిస్తాను. ఇందుకు ఒప్పుకో!'' అని, కొడుకును తీసుకుని వెళ్ళిపోయింది.



# విచక్షణ

విజయవర్మ అనే సామంతరాజు వద్ద ఒక వజ్రపుఉంగరం ఉండేది. అది ధరించిన వారికి ప్రాణభయం ఉండదని ప్రతీతి. అందుచేత దేశాన్ని ఏలేరాజు విజయవర్మను పిలిపించి, అతని వజ్రపుఉంగరాన్ని తనకు ఏ ధరకైనా సరే అమ్మమన్నాడు. విజయవర్మ దాన్ని అమ్మ నిరాకరిస్తూ, "మహారాజా, ప్రాణం కన్న డబ్బుఎక్కువా? నాలో ప్రాణం ఉండగా నేను దీన్ని ఎవరికీ ఇయ్యను," అన్నాడు.

రాజు విజయవర్మను పంపేసి మంత్రితో, విజయవర్మను చంపించి, ఆ వజ్రపుఉంగరాన్ని తెప్పించ మన్నాడు. అది మంచిపని కాదని మంత్రి రాజుకు హితవు చెప్పాడు. మంత్రి చెయ్యని పనిని రాజు సేనాపతికి అప్ప జెప్పాడు. సేనాపతి కొంత సేనతో వెళ్ళి విజయవర్మను చంపి వజ్రపుఉంగరం తెచ్చాడు. రాజు మంత్రిని పిలిచి, తన సేనాపతి విజయవర్మను చంపి వజ్రపుఉంగరం తెచ్చినందుకు సన్మానం ఏర్పాటు చెయ్యమని హెచ్చరించాడు.

"మహారాజా, ఆ ఉంగరంలో నిజంగా మహిమ ఉంటే మన సేనాపతి విజయవర్మను ఎలా చంపగలిగాడు? విజయవర్మను హత్యచేసి వచ్చినందుకు సేనాపతికి సన్మానమా?" అని అడిగాడు మంత్రి.

రాజు తెల్లమొహం వేశాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్





# పిశాచాల సలహా

రుక్మిణికీ, చంద్రయ్యకూ కొత్తగా పెళ్ళి అయింది.

పెళ్ళి కాకముందు ఆమె తన తల్లి దండ్రులను చీరలూ, నగలూ అడిగితే, "రేపు పెళ్ళి అయాక నీ మొగుణ్ణి అడుగు, కొని పెడతాడు," అనేవారు. దానితో ఆమెకు, భర్త అంటే అడగగానే కోరిన వన్నీ కొని ఇచ్చేవాడు అనే అభిప్రాయం ఏర్పడింది.

చంద్రయ్యది చిన్న ఉద్యోగం. కాని అనాథ అయినవాణ్ణి పెంచి పెద్ద చేసిన అవ్వ వాడికి లంకె బిందెల కథలూ, నిధి నిక్షేపాల కథలూ చెప్పి, తనకు కూడా ఎప్పటికైనా ఏదైనా నిధి దొరుకుతుందన్న భ్రమ కలిగించింది. వాడు అచ్చుగా తన అదృష్టం మీద ఆధారపడక, పిశాచాల సహాయంతో నిధులు సంపాదించవచ్చు నని, వాటి స్నేహంకోసం రహస్యంగా శ్మశానంలో కారాడుతూ వచ్చాడు. పెళ్ళి కాకముందు ఊళ్ళో ఏదో గదిలో ఉంటూవుండిన చంద్రయ్య, పెళ్ళి కాగానే శ్మశానానికి సమీపంలో ఒక పాడుబడిన కొంపలో కాపరం పెట్టాడు.

"ఇది ఇల్లా, వల్లకాడా? ఇదేం కొంప? మనం ఊరి మధ్య మంచి ఇల్లు కట్టుకుందాం. ఇందులో నేను కాపరం చెయ్యను," అన్నది రుక్మిణి, ఆ కొంపను చూస్తూనే.

చంద్రయ్య ఆ మాటలకు ఆశ్చర్య పోయి, "ఇల్లు కట్టడం అంటే పక్షిగూడు కట్టడం అనుకున్నావా? మనకు ఒక నిధో, నిక్షేపమో దొరకనీ, అలాగే కట్టు కుందాం!" అన్నాడు.

"నిధి దొరకడం అంటే నీళ్ళు దొరకడం అనుకున్నావా?" అని రుక్మిణి మొగుణ్ణి ఎత్తి పొడిచింది.

మాచిరాజు కామేశ్వరరావు

''చూస్తూ ఉండు, నీకే తెలుస్తుంది,'' అన్నాడు చంద్రయ్య.

ఆ రాత్రి. మంచి నిద్రలో ఉన్న రుక్మిణి ఉలిక్కిపడి లేచింది. శ్మశానం వైపు నుంచి ఏదో కోలాహలం విన వస్తున్నది.

ఆమె భర్తను నిద్ర లేపి, ''ఏమిటా గోల?'' అని అడిగింది.

''పిశాచాలు లాగుంది! నేను వాటితో మాట్లాడి వస్తాను," అంటూ చంద్రయ్య లేచి కూర్చున్నాడు.

రుక్మిణి అదిరిపడి, ''నీకేమన్నా మతి పోయిందా? పిశాచాలతో మాట్లాడడం ఏమిటి? రేపు ఈ ఇల్లు ఖాళీ చేసేద్దాం. ఈ గోల నేను భరించలేను," అన్నది.

''నీ తెలివి తెల్లవారినట్టే ఉన్నది. పిశాచాల స్నేహం కోసమే నేను శ్మశానం దగ్గిరగా ఈ ఇల్లు తీసుకున్నాను. అవి అలా అల్లరి చేస్తాయిగాని, హాని చెయ్యవు! వాటితో స్నేహం చేసుకుంటే, నిధినిక్షేపాల రహస్యాలు చెబుతాయి.'' అని చంద్రయ్య రుక్మిణికి చెప్పి, బయలుదేరి శ్మశానం కేసి వెళ్ళాడు.

శ్మశానం మొదట్లో ఉన్న మర్రిచెట్టు మీద రెండు పిశాచాలు కేరింతలు కొడుతూ, మొగ్గలు వేస్తున్నాయి. అవి చంద్రయ్యను చూస్తూనే, ''ఎవరది?



ఇక్కడికి రావటానికి నీకెంత ధైర్యం!" అని అడిగాయి.

''ధైర్యం కాదు, మీ మీద ఇష్టం! అందుకే మీతో స్నేహం కోరి వచ్చాను,'' అన్నాడు చంద్రయ్య.

పిశాచాలు అభ్యంతరం చెప్పలేదు. చంద్రయ్య కొంచెంసేపు వాటితో ముచ్చట్లాడి, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

భర్తకోసం బిక్కుబిక్కుమంటూ ఎదురుచూస్తున్న రుక్మిణి, ''పిశాచాలు కనిపించాయా? నిధినిక్షేపాల మాట చెప్పాయా?'' అని అడిగింది.

''అప్పుడేనా? మా స్నేహం కాస్త గట్టి పడనియ్యి,'' అన్నాడు చంద్రయ్య.

తరవాత చంద్రయ్య ప్రతి రాత్రీ పిశాచాలను కలుసుకుని, వాటితో కొంతసేపు కాలక్షేపం చేస్తూ వచ్చి, ఒకనాడు తన భార్యతో, "రేపు పిశాచాలను మన ఇంటికి విందుకు పిలుస్తాను. మంచి కూరలతో చక్కగా వంట చేసి ఉంచు," అన్నాడు.

అతని ఆహ్వానం పాటించి పిశాచాలు రెండూ ఒక అర్ధరాత్రి అతని ఇంటికి విందుకు వచ్చాయి. రుక్మిణి వాటికి వడ్డించింది.

చంద్రయ్య వాటితో, "మీకు ఇంకా అద్భుతంగా విందుచేసి ఉందును. కాని బీదవాణ్ణి. ఎక్కడన్నా నిధినిక్షేపాలు దొరికే మార్గం మీరు చెప్పారంటే రోజూ మీకు రాజోపచారంగా విందులు చేస్తాను," అన్నాడు.

పిశాచాలు ఈ మాటలకు ఆశ్చర్యం నటించుతూ, "మేం ఇలా పిశాచాలం కావడానికి కారణం ఏమిటనుకున్నావు? నీ లాగే నిధినిక్షేపాల కోసం అడవుల్లోనూ, పాడుబడిన ఇళ్ళల్లోనూ తవ్వుతూ, ఒక ఇంటి గోడ కూలి చచ్చిపోయి, ఇలా పిశాచాలం అయి, నానాబాధలూ పడుతున్నాం!" అన్నాయి.

"అయితే నాకు నిధి దొరికే ఆశ లేనేలేదన్న మాట?" అన్నాడు చంద్రయ్య తెల్లబోతూ.

"నిధులు దొరికితే నీ ప్రయోజకత్వం ఏమిటి? స్వయంకృషితో ఎంత సాధించగలవో చూడు!" అంటూ పిశాచాలు ఆకస్మికంగా అదృశ్యమయాయి.

చంద్రయ్యకు ఈ గుణపాఠం చెప్పటానికే పుట్టినట్టుగా ఆ పిశాచాలు మళ్ళీ చంద్రయ్య కంట పడలేదు.

అతను కూడా నిధినిక్షేపాల ఆశ వదులుకుని, వారం రోజులకల్లా శ్మశానం పక్కవున్న ఇంటిని ఖాళీచేసి, ఊరిలో మరొక ఇంటిని అద్దెకు తీసుకున్నాడు. ఆనాటి నుంచీ తాను స్వశక్తితో ఎంత సాధించగలడో చూసుకుంటూ, సార్థకంగా బతికాడు.



# అన్నదానఫలం

భద్రగిరిలో రాజప్రతినిధిగా ఉలూకభట్టు రాగానే, కుశలుడు అనే చిన్న ఉద్యోగి తన ఇంట్లో ఒక కొత్త నియమం ప్రవేశపెట్టాడు. ప్రతిపూట ఒక అతిథికి సుష్టుగా భోజనం పెట్టి, ఆ అతిథి విశ్రాంతి తీసుకుని, లేచి వెళ్ళిపోయేదాకా ఇంట్లో ఎవరూ పచ్చి మంచినీరయినా ముట్టుకోరాదు.

కుశలుడు అకస్మాత్తుగా మంచానపడి, తాను ఇంక బతకనని అనుమానంతో తన కొడుకును పిలిచి, "నేను పోయినా, నువు మాత్రం ఉలూకభట్టు రాజప్రతినిధిగా ఉన్నంత కాలమూ ముందు అతిథికి పెట్టాలన్న నియమాన్ని తప్పవద్దు," అన్నాడు.

"ఈ నియమం మానేస్తే నేం? శక్తికి మించిన ఈ అన్నదానం వల్ల ఏం ఫలం?" అని కొడుకు అడిగాడు.

"ఈ ఉలూకభట్టు వట్టి చవట! లంచగొండి! స్వార్థపరులతోనూ, అవినీతి పరులతోనూ లాలూచీపడ్డాడు. ప్రతి వస్తువులోనూ కల్తీ! అడిగే నాథుడు లేడు. విషాహారం తిని జనం చావటం గురించి అప్పుడప్పుడూ వింటూనే ఉన్నాం గదా! అందుకే ఈ అన్నదానం! మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది," అన్నాడు కుశలుడు.

—కలువకొలను సదానంద



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 మే నెల సంచికలో ప్రకటింపబడును.



S. G. Seshagiri





Mohan D. Desai

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కష్టార్జితం

రెండవ ఫోటో : పిత్రార్జితం

పంపినవారు : బి. జగదీశ్వరరావు, అమెరికన్ గెస్ట్ హౌస్, బళ్ళారి-1

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# NP 007 బబుల్ గమ్

ఉచితం
మీ 007 ప్యాక్‌లో తెల్లటి బబుల్ గమ్ గనక ఉంటే, అక్కడికక్కడే దుకాణదారుడి వద్ద నుండి మరో 007 బబుల్ గమ్‌ను ఉచితంగా పొందండి.

అతను ఆటల్లో మేటి, చదువులో తనకు తానే సాటి. అతనికి తెలుసు ఒక్క NP 007 బబుల్ గమ్ మాత్రమే పెద్ద పెద్ద బుడగల్ని యిస్తుందని. ఎందుకంటే, అది 'బబుల్ శక్తి'తో నిండినదిగా నుర! మీరు కూడా NP 007 బబుల్ గమ్‌తో బబుల్ ఛాంపియన్లు కావచ్చును. కేవలం 007 బబుల్ గమ్‌తో మాత్రమే పెద్ద పెద్ద బుడగల్ని వూదడం సాధ్యం. ఆ ఆనందాన్ని అనుభవించండి. ఇది ఎన్‌పి వారి విశిష్ట ఉత్పాదన. NP అంటే బబుల్ గమ్ ఉత్పాదకుల్లో అగ్రగణ్యులు. ఒక్క ఎన్‌పి బబుల్ గమ్‌లకి మాత్రమే ఐఎస్ఐ చిహ్నం వుంది.




*NP 'బబుల్ శక్తి'కి మరో పేరు బబుల్ గమ్*

## శభాష్!







Dattaram-NP-15 TEL

దీ నేషనల్ ప్రోడక్ట్స్, బెంగుళూరు

# చూచారా!
# మీ అనుదిన జీవితంలో టిజిఎల్ ప్రతిబింబం యెలా ప్రవేశించిందో







## ...అయితే మీ జీవితాన్ని ఆనందపర్చుటకే

టి జి ఎల్ వారి 'పోషక్' వనస్పతి, శుద్ధి చేయబడిన 'సంజీవ్' శనగనూనె యీ రెండూ మీ ఆహారమునకు నిండుదనం, రుచి ఇస్తాయి. మీ వస్త్రాలను పరిశుభ్రపర్చి, ప్రకాశవంతం చేసేందుకు టి జి ఎల్ వాషింగ్ సబ్బులు-'వికాస్' మరియు 'స్రామాల్' వున్నాయి.

మరేయికనేం! పాడి పశువులను పెంచుకోవాలని అభిలషించేవారికి. వారు పాలు దండిగా పొందుటకు టి జి ఎల్ పశుగ్రాసం వుండనేవుంది.

నిజమే, టి జి ఎల్ మీకు శ్రేష్ఠత, ఉపయోగకరము, అయిన ఉత్పత్తులను నమ్మకంతో అందిస్తూ, ఎంతో సేవ చేస్తున్నదనే విషయంలో యే మాత్రం సందేహంలేదు. గడిచిన 70 యేండ్లుగా నమ్మకముతో చేయుచున్న యీ సేవలద్వారానే టి జి ఎల్ ఇంటింటా సర్వసాధారణమైన పేరుగా నేడు పలుకబడుచున్న దనుటలో ఆశ్చర్యం లేదంటే నమ్మండి.




**టి. జి. లక్ష్మయ్య సెట్టి & సన్సు**
టి. జి. ఎల్. రోడ్, ఆదోని 518 301

maa H TGL 37

---

దయచేసి మీకు కావలసిన సరకులు మా వ్యాపారి వద్ద నుంచి పొందండి. ప్రాతినిధ్యం లేని ప్రాంతాలలో వర్తకం నెలకొల్పడానికి కావలసిన వివరాల కోసం మమ్మల్ని సంప్రదించండి.

# రాజు ముఖానికి ముసుగు

ఆవేళ రాజుయొక్క చిట్టి చెల్లెలు మీనా పుట్టిన రోజు. ఆది రాజుకి గొప్ప సంతోషాన్నిచ్చే శుభ సమయం. నందు, వినయ్, రేఖ, అశోక్ -అందరూ అందమైన కానుకలను తెస్తామన్నారు:
రాజుకి ఏం కానుక యివ్వాలో తోచలేదు.
ఆతను చాలా, చాలా చాలా ప్రత్యేకమైన కానుకను ఇవ్వాలనుకున్నాడు. ఆలోచించాడు, ఆలోచించాడు, ఆలోచించాడు ఏమివ్వాలా అని.
ఉన్నట్లుండి అతనికి ఓ అయిడియా తట్టింది.
ఆ! ముసుగు. అందంగా, రంగులుదిండే ముసుగుపైన పచ్చని దారలు, బుగ్గలపై గులాబిరంగు, కెంపువన్నె పెదవులు—ఒక్క క్షణంలో కార్డ్‌బోర్డ్ మీద బ్రష్‌తో ముసుగు బొమ్మను పెయింట్ చేసి, ముసుగులా ఉండేలా కత్తిరించాడు.
అబ్బ ఎంత అందమైన కానుక, అది చూసి మీనా మురిసిపోయింది.
ప్రతివారూ రాజు గురించి, రాజు ఇచ్చిన అద్భుతమైన కానుక గురించే మాట్లాడారు.
మరి రాజు అలా పెయింట్ చేయగలిగితే మీరూ చెయ్యగలరు మరి.

## కెమెల్
వాటర్ కలర్స్
& పోస్టర్ కలర్స్






కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్ జె.బి. నగర్
బొంబాయి 400 059.


కేమ్లిన్ అన్‌బ్రేకబుల్ పెన్సిళ్ళ ఉత్పాదకులనుండి

VISION 791TEL

# పెరుగుతున్న సంవత్సరాలు
# కాల్షియం-శాండోజ్® సంవత్సరాలు







పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనంనుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి.

రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టి పళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి.డి. మరియు బి12తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళల్లో పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

**కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది. ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.**



## కాల్షియం-శాండోజ్®
### గట్టి[illegible]టిష్టమైన ఎముకల కోసం



# లాలించాలి, పిల్లల్నేమో లాలిస్తే ఏపుగా పెరుగుతారు




ప్రీతితో యిచ్చేది
## పార్లే గ్లూకో
## మజా రుచితో
## ఎంతో శక్తితో

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి, పుష్టి నిచ్చే లక్షణాలు గలది.




రతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్—
వరల్డ్ ఎవార్డ్ విజేత




OUR GOLDEN YEAR OF THANKSGIVING

everest/78/PP/132-tl